శ్రీ



బ్రహ్మానంద విరచితము.

# ఉత్తర రామ చరిత.



చెన్నపురి

ఆనందముద్రాయంత్రాలయముద్రితము.

1914.

వెల. 0-7-0] [కాపీరైట్ రిజిస్టర్డు.

# కవివిషయము.

పట్టణము గాకున్నను కేవలము పల్లెకాదు. "కాకరపల్లి" అను పేరున వ్యవహరింపఁబడు సాధారణమైన గ్రామ మొకటి వసిష్ఠ నదీ తీరమునఁ గలదు. ఆ గ్రామములోఁ దక్కిన శాఖలవారు విశేషముగా లేకపోయినను ఆ రామద్రావిడ శాఖవారు సుమారు నూటిండ్లవారున్నారు. ఆ శాఖలోనే యొక తెగవారు (మావారు) ద్వివేదులు అను సార్థకనామములుండిరి. వారే యిప్పుడన్నిచోట్లను వేదులవారు అని వ్యవహరింపఁబడుచున్నారు. ఆ వేదులవారి కుటుంబమే నేను (ప్రస్తుత కవి) జనించినది. మాతామహులు చర్లవారు. అత్తవారు కామవరపు వారు. మిగిలిన విషయమును బ్రహ్మానందసర్వస్వములో విస్తరించెద.

## బ్రహ్మానంద పుస్తకములు.

| | | |
|---|---|---|
| ఉత్తరరామచరితము. | (7 అంకముల నాటకము.) | 0-7-0 |
| అభినవమోహనము. | (7 అంకముల నాటకము.) | 0-6-6 |
| ఆనందోదయము. | (5 అంకముల నాటకము.) | 0-2-0 |
| శృంగారతరంగిణి. | (సరసమగు భాణము.) | 0-4-0 |
| వజ్రనాభవిజయము. | (8 అంకముల నాటకము.) | 0-6-0 |
| ప్రద్యుమ్నానందము. | (6 అంకముల నాటకము.) | 0-6-0 |
| ధనంజయవిజయము. | (వ్యాయోగము.) | 0-2-0 |
| దమయంతీపరిణయము. | (ప్రబంధము.) | 0-2-0 |
| శ్రీహరిశతకము. | ... ... | 0-1-0 |
| పుష్పబాణవిలాసము. | ... ... | 0-0-6 |

ద్వివేది - బ్రహ్మానందశాస్త్రి,
తుని. గోదావరిజిల్లా.

# కథాసంగ్రహము.

శ్రీరాముని పట్టాభిషేక మయిన పిమ్మట నొకప్పుడు కౌసల్యాయు సవతులును గలసి అల్లుఁడు ఋశ్యశృంగుఁ డారంభించిన యజ్ఞముఁ జూచుటకై అరుంధతీ వసిష్ఠులను బురస్కరించుకొని వెళ్లిరి. అప్పుడు సీతాదేవి గర్భిణి గావునఁ దీసికొని వెళ్లలేదు. అందువలన రామునిఁగూడ నింటి దగ్గఱనే యుంచిరి. పిమ్మట నొకనాఁడు రాముఁడు ప్రజ లాడుకొను రహస్యములను విని రమ్మని దుర్ముఖుఁ డను పరిచారకునిఁ బంపి వినోదార్థము సీతాదేవికిఁ జిత్రపటముఁ జూపించుచుండ దానిలో భాగీరథి కనఁబడెను. అదిచూచి ముచ్చటపడి సీతాదేవి మరల నొకపర్యాయము గంగానదిలో స్నానముఁ జేయవలయు ననియు వనభూములలో విహరింపవలె ననియు విభునిఁ బ్రార్థించెను. అప్పుడే దుర్ముఖుఁడును వచ్చి ప్రజ లేవ్వో చోటున సీతాదేవి నాడిపోయుచున్నారని రాముని చెవిలోఁ జెప్పి వెళ్లెను.

తరువాత సీతాదేవికి వచ్చిన విపత్తును విని వానప్రస్థుఁడై జనక మహారాజుకూడ వాల్మీకిమహాముని తపోవనమును జేరెను. దశరథమహారాజు భార్యలుకూడ జన్నమైనతరువాత బయలుదేఱి అరుంధతీ వసిష్ఠులతో నక్కడకే వచ్చిరి.

అక్కడ బంగారపు సీతాప్రతిమతో రాముఁ డశ్వమేధము సంకల్పించి తురగరక్షణార్థము లక్ష్మణపుత్త్రుఁడయిన ఛందకేతువును నియోగించి దండకారణ్యములోఁ దపము సేయుచున్న శూద్రుని దండించుటకై తాను వెళ్లెను. పదపడి యశ్వము వాల్మీకితపోవనసమీపమునకు రాగానే లవునకును జంద్రకేతువునకును రణము సంభవించెను. అంతలో నా దారినే యింటిఁ బోవుచు రామభద్రుఁడుకూడ నక్కడకే వచ్చెను.

పిమ్మట వాల్మీకి వారి నందఱిని సమావేశముఁ జేసి నాటక మొకఁ డాడించి సీతామహిమ వెల్లడించి మెప్పించి యెల్లవారి నొప్పించి రామునకుఁ గుశలవుల నొప్పగించి సీతాదేవిని జేతపఱిచెను.

# ఇందలి పాత్రములు.

| పురుషులు. | స్త్రీలు. |
|---|---|
| **I. అంకము.** | |
| 1. సూత్రధారుఁడు. | 1. సీత. |
| 2. నటుఁడు. | 2. ప్రతీహారి. |
| 3. రాముఁడు. | |
| 4. కంచుకి. | |
| 5. అష్టావక్రుఁడు. | |
| 6. లక్ష్మణుఁడు. | |
| 7. దుర్ముఖుఁడు. | |
| **II. అంకము.** | |
| 1. రాముఁడు. | 1. ఆత్రేయి. |
| 2. శంబూకుఁడు. | 2. వాసంతి. |
| **III. అంకము.** | |
| 1. రాముఁడు. | 1. తమస. |
| | 2. మురళ. |
| | 3. సీత. |
| | 4. వాసంతి. |
| **IV. అంకము.** | |
| 1. సౌధాతకి. | 1. అరుంధతి. |
| 2. దాండాయనుఁడు. | 2. కౌసల్య. |
| 3. జనకుఁడు. | |
| 4. గృష్టి. | |
| 5. లవుఁడు. | |
| 6. వటువులు. | |

| పురుషులు. | స్త్రీలు. |
|---|---|
| **V. అంకము.** | |
| 1. సుమంత్రుఁడు. | |
| 2. చంద్రకేతువు. | |
| 3. లవుఁడు. | |
| **VI. అంకము.** | |
| 1. విద్యాధరుఁడు. | 1. విద్యాధరి. |
| 2. రాముఁడు | |
| 3. లవుఁడు. | |
| 4. చంద్రకేతువు. | |
| 5. కుశుఁడు. | |
| **VII. అంకము.** | |
| 1. లక్ష్మణుఁడు. | 1. గంగ. |
| 2. రాముఁడు. | 2. పృథివి. |
| 3. సూత్రధారుఁడు. | 3. సీత. |
| 4. వాల్మీకి. | 4. అరుంధతి. |
| 5. కుశుఁడు. | |
| 6. లవుఁడు. | |

వల్లఁ గలఁకఁబాఱిన సీతాదేవి నూఱడింప మహారాజుగారు ధర్మాసనమునుండి వాసగృహమును బ్రవేశించి'' రని జను లనుకొనుచున్నారా?

(నిష్క్రమింతురు.)

(తరువాత రాముఁడును సీతయుఁ గూర్చుండి కనఁబడుదురు.)

రాముఁడు—దేవీ! చింతింపకు. పెద్ద లెన్నఁడును వారే మనలను వదలి యుండలేరు. ఏమి సేయుదురు! అనుష్ఠానపరతంత్రులు స్వతంత్రులు కారు. అందును గృహస్థాశ్రమ మాహితాగ్నులకు బొత్తిగా సందీయదు.

సీత—ఔను. అది నే నెఱుఁగుదును. అయినను బంధు వియోగ పరితాపములు పట్టరాకున్నవి.

రా—దేవీ! ఇట్లే సంసారము సర్వము హృదయ శల్యము. అందువల్లనే దీనికి జడిసి జడదారులై మనీషు లరణ్యమున విశ్రమింతురు.

కంచుకి—(వచ్చి) రామభద్రా! (నాలుక కఱచుకొని) మహారాజా! జయము!

రా—(నవ్వుకొని)ఓయీ! క్రొత్తపిలుపేల? అలవాటుగానే పిలు. అదేనాకు సంతోషము.

కం—మహారాజా! ఋశ్యశృంగులవారి యాశ్రమమునుండి అష్టావక్రులు వచ్చియున్నారు.

సీత—ఆలస్య మెందుకు?

రా—త్వరగాఁ దీసికొని రమ్ము.

కం—(నిష్క్రమించు.)

అష్టావక్రుఁడు—(వచ్చి) శుభము! మహారాజా! శుభము!

రా—అయ్యా! నమస్కారము. రండు! దయ చేయుఁడు!

సీత—అయ్యా! వందనము. కుశలమా మా యత్తలకు? మా అన్నకును మా వదినెకును సేమమే కద?

రా—మా బావయు మాఅక్కయు నిర్విఘ్నముగా సోమపానముఁజేసి సుఖమున్నారుకద?

సీత—అయ్యా! మా వదిన మమ్మెప్పుడైన స్మరించునా?

అష్టా—(కూర్చుండి) దేవీ! స్మరింపకేమి? వసిష్ఠు లిట్లు చెప్పు మనిరి.

సీత—అయ్యా! ఏమని?

అష్టా—అమ్మా! విదేహరాజపుత్రి!

సీ. జను లెల్లరును మెచ్చ సర్వమ్మునకు నోర్చు
సర్వంసహాదేవి జనని నీకు
బ్రహ్మకన్నను మిన్న బహుళతపోధనరాశి
జనకరాజర్షి కుంజరుఁడు తండ్రి
కిరణమాలియు నేను గురువులమై యొప్ప
నవనీ ధురంధరు లత్తవారు
ముక్కంటి విలు బాల్యమున విఱిచిన బాహు
బలశాలి నయశాలి ప్రాణవిభుఁడు

గీ. శ్రీ కళా పరిశుద్ధ చారిత్రి వీవు
శ్రేయ మని మేము నొక్క యాశీర్వదింప
నింతకన్నను నీకు నొండేమి కలదు?
వీరమాతవు కమ్ము! కుమారి! యింక.

రా—దేవీ! ధన్యులము.

గీ. కాఁగలట్టివి పరికించి కార్యములను
బలుకు చుందురు లౌకికుల్ బహు సుమతులు
అట్టులా? ఆద్య మునులు వీ రెట్టు లనిన
జెరిగియే తీరవలెఁ జుమీ సర్వ మటులు.

అష్టా—మహారాజ! అరుంధతీదేవియు, అమ్మయు, అక్కయు నందఱుఁ దమతో నిది మఱిమఱిఁ జెప్ప మనిరి.

రా—అయ్యో! ఏమది?

అష్టా—"వేవిళ్లుగావున జానకి యేదేని కోరెనేని వెంటనే చేయుమని."

రా—ఈమె చెప్పెనేని నేను జేయుట కభ్యంతరము లేదు.

అష్టా—"అమ్మా! నెలలు నిండుటచేఁ గొనిపోలేదు. నీ వినోదార్థమే రామభద్రునిఁగూడ నందే యుంచితిమి. పుత్త్రపూర్ణోత్సంగవగు నిన్ను మేమే చూడఁగలము" అని ఋశ్యశృంగులు చెప్ప మన్నారు.

రా—(ముచ్చటతో నవ్వి) అయ్యో! గురువులగు వసిష్ఠులు నాకేమియును ఆనతీయలేదా?

అష్టా—మహారాజా! వసిష్ఠు లిట్లు చెప్పమన్నారు.

# ప్రథమాఙ్కము.

గీ. అల్లుఁ డిచ్చోట మము నిల్పి యజ్ఞ మనుచు
బాలుఁడవు నీవు క్రొత్త భూపాలనంబు
ఎట్లు రంజింతువో యనుమీ యెల్ల జనులఁ
బ్రాణములకన్న యశమే పరంబు మీకు.

రా—అయ్యా! వారి సెలవు ప్రకారము.

క. విడుతును స్నేహము సర్వము
విడుతు దయాంతఃకరణము విడుతు సుఖమ్మున్
విడుతును జానకి నయినను
విడ జగదారాధనమ్మును విడువను విడువన్.

సీత—కనుకనే రాఘవ ధురంధరు లార్యపుత్రులు.

రా—ఎవ రక్కడ? అయ్యా! తమరు విశ్రమింపుఁడు!

అష్టా—(లేచి పరిక్రమించి) ఇదిగో! కుమారలక్ష్మణుఁడు వచ్చినాఁడు. (నిష్క్రమించు.)

లక్ష్మ—(వచ్చి) ఆర్యా! జయము! మన చెప్పినట్లు చిత్రకారుఁడు చిత్రించినాఁడు.

రా—వత్సా! లక్ష్మణ! ఎఱుఁగుదువా ? ఇది జానకీవినోదమునకు. ఎంతవఱకుఁ జిత్రింపఁ బడినది?

లక్ష్మ—అగ్నిశుద్ధి పర్యంతము.

రా—శ్రీహరీ! గీ. పుట్టు పూర్వమే పూతయై పుట్టినట్టి
జానకికిఁ గూడ శుద్ధి ప్రసక్తు లేల?
నీళ్లు కడిగెడు వారలు నిప్పు పుటము
వేయు వారలుఁ గలరె యీ విపులయందు ?

దేవీ ! దేవయజనసంభవ ! అనుగ్రహింపు ! ఇదిగో ! జీవితావధి నమస్కారము.

సీత—కానిండు ! మీ చరితము చూతము. రెండు !

(అందఱును లేచి పరిక్రమింతురు.)

లక్ష్మ—ఇదే చిత్తరువు.

సీత—(చూచి) ఆర్యపుత్రునిఁ బొగడుచున్నట్లు మీఁదనున్న వీరెవరు ?

లక్ష్మ—ఇవి తాటకను జంపునపుడు విశ్వామిత్రుఁ డొసఁగిన జృంభకాస్త్రములు.

రా—దేవీ ! దివ్యాస్త్రములను నమస్కరింపుము.

సీత—చిత్తము. (నమస్కరించు.)

రా—ఇవి నీప్రసవములను బొందు.

సీత—మహాప్రసాదము.

లక్ష్మ—ఇది మిథిలా వృత్తాంతము.

సీత—ఈ నలుగురు మీ యన్నదమ్ములు నాఁటి పెండ్లికొడుకులు. ఆహా! నాకుసర్వము మరల నాఁటియానందమే యిపుడు.

రా—అవును. గీ. సుముఖి! నీముఖశ్రీ వివశుండ నగుచు
గౌతముని ప్రేరణంబునఁ గంకణములు
ఘల్లురన నేను నీకరగ్రహము సేయు
నాఁటి యానందమే సుమీ నాకు నిపుడు.

లక్ష్మ—ఈమె పెద్దవదినె దేవి. ఈమె చిన్నవదినె మాండవి. మఱఁదలు శ్రుతకీర్తి.

సీత—(నవ్వుచు) ఈమె యెవతె?

లక్ష్మ—(సిగ్గుపడుచు నవ్వుకొని తనలో) ఊర్మిళ నడుగుచున్నది. కానీ! ముందఱికు జరుపుము. (ప్రకాశము) చూడఁదగినది యింకను ముందు విశేష మున్నది. ఇదిగో! ఇతఁడు పరశురాముఁడు.

సీత—వణఁకు పుట్టుచున్నది.

రా—మహాత్మా! నమస్కారము.

లక్ష్మ—దేవీ! ఈయన మా యన్నచే.

రా—లక్ష్మణా! చూడఁదగినది యింకను ముందున్నది. ముందఱికి నడువుము.

సీత—(చూచి—తనలో) ఆహా! ఏమి యీయన వినయము!

లక్ష్మ—ఇదిగో! మన మందఱ మయోధ్యకు వచ్చితిమి.

రా—(కన్నీటితో) గీ. మంచిచెడ్డలు తండ్రి వీక్షించుచుండఁ
దల్లులును ముద్దుముచ్చటల్ దలఁచుచుండఁ
గ్రొత్త ప్రియురాండ్రతోఁ గూడి కులికినట్టి
క్షణము లవి తమ్ముఁడా! రావు కద మఱింక!

మఱియు నప్పుడు.

శా. మొగ్గల్ గట్టుచు వచ్చు పల్వరుసతోఁ బుష్పాలకుల్ దాదులై

యుగ్గుం బోయఁగఁజాలు దంతములతో హాళాంఁదళ్కు రేయెండకున్
నిగ్గుల్ దిద్దఁగలట్టి మైమెఱుఁగుతోఁ నిద్దంపు లేఁజూపుతో
మొగ్గించెఁగద యీ విదేహసుత నామోదంబు పూర్ణంబుగా.

లక్ష్మ—ఇది మంథర.

రా—(ఇంకొకవంకఁ జూపి) దేవీ! వైదేహీ! ఇది శృంగిబేర పురమందలి యింగుద వృక్షము. ఇక్కడనే గుహునకు మనకును స్నేహము.

లక్ష్మ—(నవ్వి) మా కైకమ్మ మాట మఱపించినాఁడు.

సీత—ఇది జటాసంయమనము. ఇది భాగీరథి

రా—తల్లీ! రఘుకులదేవతా! నమస్కారము. కోడలగు సీత నరుంధతివలె నీవున సర్వదా మంగళప్రదవై పాలింపుము!

లక్ష్మ—ఇది చిత్రకూటమునకుఁ బోవు దారిలో యమునాతీరమున నున్న మఱ్ఱిచెట్టు.

రా—(కోరికతోఁ జూచు.)

సీత—దేవా! జ్ఞాపక మున్నదా?

రా—దేవీ! ఎందుకుండదు?

గీ. నడకవల్లను మిక్కిలి బడలి కలువ
కాఁడ లట్లు వాడిన ప్రతీకములతోడ
కౌఁగిళులఁ దేఱి నాదు వక్షమున వ్రాలి
యిచ్చటనే కదా నిద్రించితీవు మగువ!

లక్ష్మ—ఇది వింధ్యాటవీముఖమున విరాధవృత్తాంతము.

సీత—అది వద్దు భయంకరము. ఏమూలఁ జూచినను బుష్పించిన కడిమిచెట్లపై నృత్యము సేయు నెమిళ్లు గల యిది యేపర్వతము?

లక్ష్మ—ఇది జనస్థానమందలి ప్రస్రవణపర్వతము.

రా—మ. కలదా నీకిది జ్ఞాపకమ్ము చెలువా! కై సేయ సౌమిత్రి యే
సిలుగుల్ లేక సుఖించినట్టి దినముల్? శ్రీ నొప్పు గోదావరీ
పులినంబుల్ మఱి జ్ఞాపకంబు కలవా? భూపుత్రి! తత్తీరముల్
కలితంబుల్ స్మరియింతువా మన విలోల క్రీడలన్ జానకీ!

మఱియు.

*ఉ. చెక్కులు లేకమై కలియఁ జేరిచి మెల్లన ముచ్చటించుకొం
చేక్కఱి నేవు చేక్కటులు హద్దును బద్దును మీఱి బాహు వ
క్కొక్కటి కౌఁగిలింతలకు నూఁతము కాఁగఁ బెనంగ రేయి తా
నిక్కడ యామముల్ తెలియ కిట్టె చనెన్ మనకున్ దలోదరీ!

లక్ష్మ—ఇది పంచవటి. ఇది శూర్పణఖ.

సీత—హా! ఆర్యపుత్రా!

రా—ఓసీ! భీరూ! ఇది చిత్తరువు.

సీత—ఎట్లయినను దుర్జనుఁడు దుఃఖము పుట్టించు.

రా—అవుర! జనస్థాన వృత్తాంత మంతయు మరల నా కిప్పుడు ప్రత్యక్షముగా జరగుచున్నట్లున్నది.

లక్ష్మ-మ. తగుబంగారపుమాయలేడియగుచున్ నంత్రమ్ములన్ బన్నియా
పగిదిన్ మిక్కిలిభంగపెట్టిరిచేటన్ బాపాత్ములారాక్షసుల్
తెగిధైర్యంబటుమీఁద నార్యుఁడునుగుందెన్; జూచినన్ భిన్నమై
పగులున్ వజ్ర; మలోయటంచుఁ బాగులున్ బాషాణమున్ నీరమై.

సీత—(కన్నీరొలుకఁ దనలో) అయ్యో! ఆర్యపుత్రుఁడు నా మూలమున నెంత దుఃఖపడినాఁడు!

లక్ష్మ—(సాకూతముగా) ఆర్యా! ఇదేమి?

రా—తమ్ముఁడా! ఇది నాఁడు సీతా విప్రయోగమునఁ ప్రవహించిన కన్నీటి వఱద. తలఁచుకొన్న మరల నిప్పుడు తరంగము లయి పొరలు.

సీత—అయ్యో! దేవ! రణరణకమున నాకును సర్వ మిప్ప డట్లే యున్నది.

లక్ష్మ—(తనలో) కానిమ్ము. వీరి నింకొకవిషయమునకు మరల్తు. (చిత్తరువుఁ జూచి) ఇదిగో! ఇది జటాయువుచారిత్రము.

* ఉ. చెక్కులు లొక్కటై కలియఁ జేరిచి మెల్లగ ముచ్చటించుకొం
చేక్కఱి నేవొ చేక్కటులు హద్దును బద్దును మీఱి బాహు వొ
క్కొక్కటి కౌఁగిలింతలకు నూఁతము కాఁగఁ బెనంగ రేయి! యే
యిక్కడ యామముల్ తెలియ కేగెఁగదా మనకున్ గృశోదరీ!

శ్రీరస్తు.

బ్రహ్మానందీయము.

# ఉత్తరరామచరితము

## ప్రథమాఙ్కము.

గీ. హరియు హరుఁడును బ్రహ్మయు నమరవరులు
వారిరాణులు మునులును వారిసతులు
నెల్లవారును గరుణార్ద్రహృదయు లగుచుఁ
గడు శుభప్రదు లవుదురు గాక ఘనులు!

మఱియు.

గీ. అవ్యయంబులు శ్రీమంగళాకరములు
పావనంబులు హరి కృపాపాలితములు
ఘన వచోనిధు లానంద గర్భకములు
బ్రహ్మవాక్కులు మీకు శుభంబు లొసఁగు

(నాంద్యంతమున.)

సూత్రధారుఁడు— (వచ్చి) ఆర్యులారా! నేఁడు మా ప్రదర్శించే నాటకము బ్రహ్మానంద విరచితము. ఉత్తర రామచరితము.

గీ. సంస్కృతమ్మున భవభూతి సరసరీతి
రచనఁ గావించె నుత్తర రామచరిత
కళలు మెఱయ బ్రహ్మానంద కవి గ్రహించి
శ్రీకరంబును దాని నాంధ్రీకరించె.

(కలయఁజూచి) ఓయీ! ఇదేమి యింకను రేయుంబగళ్లు నిరంతరము మంగళధ్వ

నులు మ్రోయ వలసిన మహారాజ రామచంద్రుని పట్టాభిషేక సమయమయ్యు ముంగిళ్ల నిప్పు డెక్కడను జెప్పుడే వినఁబడదు?

నటుఁడు—(వచ్చి) భావా! లంకా యుద్ధములో సాయముఁ జేసిన మిత్రులు వానరులును, రాక్షసులును, బ్రహ్మర్షులును, దేవర్షులును, రాజర్షులును, నానా దిగంతములనుండి వచ్చిన యెల్లరును మహారాజునొద్ద సెలవు గైకొని తమ తమ గృహములకుఁ జనిరి. వీరే కద ఆ సందడికి మూలము?

సూత్ర—ఔను. ఇది కారణము.

నటుఁడు—ఇంకొకటి. నెలలు నిండిన జానకినిగూడ విడిచి రాఘవ మాతలు కూడ మువ్వురు అల్లుఁ డారంభించిన పండ్రెండు సంవత్సరముల దీక్ష గల జన్నమునకు నరుంధతిని బురస్కరించుకొని వసిష్ఠునితో నరిగిరి.

సూత్ర—ఓయీ! పొరుగూరి వాఁడను గనుకఁ దెలియ కడిగెదను. అల్లుఁ డెవరు?

నటుఁడు—శాంతావిభుఁడు, విభండకసుతుఁడు, ఋశ్యశృంగుఁడు.

సూత్ర—ఏమీ! దశరథునికూఁతురా శాంత ?

నటుఁడు—అవును.

సూత్ర—రోమపాదుఁడో?

నటుఁడు—పెంపుడుతండ్రి.

సూత్ర—పోనీ! మన కెందుకు ? రాజద్వారమునకుఁ బోయి కులాచారప్రకారము మన స్తోత్ర మేదో మనము కావింతము రమ్ము.

నటుఁడు—భావా! అట్లయిన ముందు నిర్దోషమగు స్తోత్రపద్ధతి నిరూపింపు.

సూత్ర—ఏదో యొకటి మనకుఁ దోఁచినట్లు. నిర్దోష మెందుకు? ఎట్లయినను వాక్కుల పట్లను వనితల పట్లను జనులు దుర్జనులే.

నటుఁడు—అతి దుర్జనులు. ఇంతకన్న నేమున్నది? రాక్షసుల లంకలో నున్నదఁట! అగ్ని శుద్ధియందు నమ్మకము లేదఁట! ఏవో యిట్లు దేవి యగు వైదేహీపైని గూడ నపవాదములే.

సూత్ర—కష్టము! ఈ మాట మహారాజు వినిన నేమగునో! సర్వథా శ్రేయోవిధాతలగు ఋషులును దేవతలును గలరు. (ఆకాశమున లక్ష్యముంచి) ఓయీ! ఇప్పుడు మహారాజుగా రెక్కడనున్నారు? (ఆలకించి.) "జనకుఁడగు జనకమహారాజుగారింతకు మునుపే యిక్కడనుండి స్వదేశమగు విదేహ దేశమునకు విచ్చేసిరి. అందు

రా—హా! తాత!

సీత—అయ్యో! తండ్రీ! నీవంటి పరమోపకారి మరల మా కెక్కడ?

లక్ష్మ—ఇది మతంగాశ్రమము. ఈమె శ్రమణ. ఇది పంపా సరస్సు.

సీత—ఇక్కడ నేకాఁబోలు నార్యపుత్త్రుఁడు కంఠ మెత్తి కన్నీరు విడిచినది!

రా—దేవీ! ఈ పద్మాకరము మిగుల రమణీయము.

గీ. చూచినాఁడను లోచనాశ్రువులు జోఁటి
మరల నుదయించు నడుమను మగువ! యిచట
హంస పక్షోద్ధతులఁ గాఁడ లల్లలాడు
నంబుజములను మఱియు నీలాంబుజముల.

లక్ష్మ—ఆర్యాఁ డితఁడు హనుమంతుఁడు.

సీత—ఇతఁడు మహోపకారి యగు మహానుభావుఁడు.

రా— గీ. అంజనానంద వర్ధనుం డనఘుఁ డితఁడు
బాహు బల శాలి నయ శాలి భద్ర గుణుఁడు
ఇతని మూలమ్ముననె కదా యెల్ల మనము
బ్రతికినారము విప దర్ణవంబుఁ గడచి.

సీత—వత్సా! లక్ష్మణ! ఈ చెట్టుమొదల నార్యపుత్త్రుఁడు మూర్ఛిల్లి నీచే నుపచరింపఁ బడుచున్న యీ పర్వతము పేరేమి?

లక్ష్మ— గీ. మాల్యవంతము తల్లి! యీమహితనగము
ఆర్ద్ర మేఘము లున్నది ఆర్యుఁ డిచట

రా— వలదు వలదింక లక్ష్మణా! వలదు మరల
జానకీ విప్రయోగపు జోడ లవియె.

లక్ష్మ—ఈపైని దేవరయుఁ గపి రాక్షసులయుఁ గర్మ లనంతములు. దేవియు మిగుల నలసినది. కావున విశ్రాంతికొఱకు విన్నవించుకొనుచున్నాను.

సీత—దేవా! ఈ చిత్ర దర్శనమువలన నాకొకముచ్చటవుచున్నది.

రా—దేవీ! ఆజ్ఞాపింపుము.

సీత—మరల నొకమాఱు ప్రసన్న గంభీరములగు వనభూములలో విహరించి పావనమగు చల్లని భాగీరథిలో జలక మాడవలయు.

రా—వత్సా ! లక్ష్మణ ! జానకీ మనోరథ మప్పుడే కావింపు మని గురువు లిప్పుడే కబురంపిరి. కావునఁ గుదుపు లేని రథ మొకటి తోలించుకొని రమ్ము.

సీత—మీరు కూడ రావలెను.

రా—ఓహో ! కఠినహృదయ ! ఇదికూడనా ?

లక్ష్మ—తమ సెలవు ప్రకారము. (నిష్క్రమించును.)

రా—ప్రేయసీ ! ఇదిగో ! ఈ కిటికీల గదిలో నిక్కడఁ గొంచెముసేపు విశ్రమింపుము.

సీత—నాకును బడలికవలన నిద్ర నిలుప కున్నది.

రా—అట్లయినఁ జంద్రకాంత హారముఁ బోలు నీ బాహు లతతో నా కంఠ మలంకరించి నిద్రింపుము.

సీత—(రాముని బుజముపైఁ జేయి చేర్పఁ బోయి సిగ్గుపడు.)

రా—(చేయి పట్టుకొని స్వయముగాఁ దన మెడపై నుంచుకొని) ప్రేయసీ ! ఇదేమి ? నీ శరీర సంపర్కమున నా కిట్టిదని చెప్పరానిది యేదో పారవశ్య మయ్యెడిని.

సీత—ఆ సర్వము నాపైఁ గల తమ యనుగ్రహము.

రా— గీ. వాడిపోయిన జీవనవ్రతతి మరల
మొగ్గ తొడిగించు నింద్రియమోహనములు
శ్రవణ పేయమ్ములు మనో రసాయనములు
నీ సుభాషితామృతము లోనీరజాక్షి. !.

(ఆనందముతో)

గీ. చంద్ర కిరణ ప్రసార మోచందనంబొ
కల్ప పుష్ప మరంద మోకర్పూరంబొ
ఘోర! యేమి! యీప్రియురాలిహ స్త వల్లి
చేంద మయ్యారె! కేవలానంద మయము.

దేవీ ! ఇదిగో ! ఎన్నఁడును బర స్త్రీ సమాశ్రితము కాని యీ రామబాహువు తలగడగా నిడుకొని నిద్రింపుము.

సీత—(నిద్రనభినయించు.) హా ! ఆర్యపుత్ర !

రా—ఏమి యీ పలవరింత ! నా ప్రియురాలు మాటాడుచునే నిదురవోయినది.

(చూచి) గీ. కనుల కమృతాంజనంబు లీకలికి కళలు
కంఠమునఁ జంద్ర హార మీకాంత కరము
చందనము ప్రతీకముల కీసాధ్వి స్పర్శ
ప్రియము సర్వము విరహ మేకవిషముగాని.

ప్రతీహారి—(వచ్చి) దేవా! వచ్చినాఁడు.

రా—ఎవరు?

ప్రతీ—దుర్ముఖుఁడు.

రా—(తనలో) ఓహో! జనులు చోటునఁ జెప్పుకొను మాటలు విని వచ్చుటకై వీనిఁ బంపితి. (ప్రకాశము) లోపలకు రానిమ్ము.

ప్రతి—(నిష్క్రమించును.)

దుర్ము—(వచ్చి) కటకటా! సీతాదేవినిగూర్చిన యీ జనాపవాదము దేవర కేమని విన్నవింతు! అయినను దప్పదు. ఈ నిర్భాగ్యుని నియోగ మిట్టిది.

సీత—హా! అర్యపుత్ర! ఎక్కడనున్నావు?

రా—ఓహో! రణరణక దాయిని యగు చిత్ర దర్శనమువలని విరహ భావన దేవికి స్వప్నోద్యోగము చేయుచున్నది. (అంగము నిమురుచు).

మ. అగు నద్వైతము సర్వవేళ సుఖ దుఃఖావస్థ లందన్నిటన్
దగు డెందానకు విశ్రమంబు జరయున్ భంగింప దాహ్లాదమున్
నెగడున్ గోరినదాది ప్రేమము కడున్ జీవించు నన్నాళ్లునున్
దగుఁ దై భద్రమె కోరుచుండు మఱి ఆదాంపత్య మెల్లప్పుడున్.

దుర్ము—(సమీపించి) దేవా! జయము.

రా—దుర్ముఖ! సంశయింపక నీవు విన్నది సర్వము చెప్పుము.

దుర్ము—చిత్తము. తమ పరిపాలనము తండ్రిగారి పరిపాలనముకంటెను సహస్రవిధముల సుఖముగా నున్నదని జను లనుకొనుచున్నారు.

రా—అది పొగడిక. దానికేమి? దోషము మాట నే నడిగినది.

దుర్ము—(కన్నీటితో) దేవా! (చెవిలో నేదో చెప్పును.)

రా—హా! దైవమా! ఏమి యీ పిడుగువంటి మాట! (మూర్ఛిల్లును.)

దుర్ము—దేవా! ఊఱడిల్లుఁడు.

రా—(నిట్టూర్చి) గీ. కటకటా ! పర గృహ వాస కారణమున
జానకికి వచ్చె నపదూఱు జ్వలనమందుఁ
బాపుకొన్నాము ; దురదృష్ట వశమువలన
మరల నాళర్క విషమట్లు పెరిఁగె నదియె.

అయ్యో ! మందభాగ్యుఁడనగు నే నేమిసేయుదు ! (ఆలోచించి) ఇంతకన్న నేమున్నది ?

గీ. ఎట్టు లయినను జగముల కెల్ల ముదము
లను ఘటించుటే సుజనుల లక్షణంబు
దానికై కాదె మముఁ గన్న తాతగారు
నన్ను విడిచిరి విడిరి ప్రాణాలుకూడ.

ఇప్పుడే యీ విషయము గురువుగారును గబు రంపిరి. అదియునుం గాక.

గీ. భూమిపాలురు పెక్కు రుద్దామ యశులు
వన్నె మించిన యీ సూర్య వంశమునకు
నేఁడు నా మూలమున నింద నెగడెనేని
పాప భూయిష్ఠ మైనట్టి బ్రతు కిదేల ?

హా ! దేవీ ! దేవయజనసంభవా ! జనకనందినీ ! హా ! మహారణ్య వాస ప్రియ సఖీ!

గీ. లోకములు పుణ్యవంతముల్ సేసి కతానఁ
బాపములు నిన్నుఁ బ్రజ లాడు పలుకు లెల్ల
లోకములు నాథవంతముల్ సేసి కతమున
నీ వనాథవై పోదువా దేవి యింక !

దుర్ముఖా ! నీవు వెళ్లి క్రొత్తగా రాజ్యమునకు వచ్చిన రాజే రాముఁ డిట్లాజ్ఞాపించెనని లక్ష్మణునితోఁ జెప్పుము. (ఏదో చెవిలోఁ జెప్పును.)

దుర్ము—దేవా ! చిచ్చుఁ జొచ్చివచ్చిన సీతాదేవికి గర్భవతికి దుర్జను లనుకొన్న యేదో మాటవలన నిట్లు కావించుట కడు దురన్యాయము.

రా—ఏమీ ! ప్రజలా దుర్జనులు ?

గీ. ప్రజల కిక్ష్వాకు వంశము బహు మతము

దైవగతి వాంఛ్య బీజముల్ దాన మొలచె
అద్భుతపు శుద్ధిఁ జూచితి మనుచుఁ జెప్ప
నెన్నఁడో యెక్కడనో దాని నెవఁడు నమ్ము?

నీవు పొమ్ము.

దుర్ము—అయ్యో! తల్లీ! జానకీ! (నిష్క్రమించు.)

రా—హా! కష్టము. ఇపుడు నేను ఘోర కర్ముఁడ నగు ఘాతుకుఁడ నవుచున్నాను.

గీ. ప్రేమతోడను జిలుకను బెంచి పెంచి
పిమ్మటను వ్యాధునకు సమర్పించినట్లు
సౌహృదంబునఁ బెడఁబాయఁ జాలనట్టి
ప్రేయసిని మృత్యు ముఖమునఁ బెట్టుచుంటి.

పాపాత్ముఁడను. ఇఁక నే నీమెను స్పృశింపఁ దగను. (సీత తలయెత్తి మెల్లగాఁ జేయి తీసికొని.)

గీ. వెలఁదిరో! నీవు చందన వృక్షమనుచుఁ
జేరితివి కాని యిది విషభూరుహంబు
ముగ్ధవై యింక నన్నేల పూవుఁబోఁడి!
విషము కర్మ చండాలుఁడు వీఁడు నిజము.

(లేచి) హా! కష్టము. ఇఁక రాముని బ్రతుకు నిష్ఫలము. అయ్యో! జీవలోక మెంతలో మాఱినది! సర్వము జీర్ణారణ్యము. సంసార మసారము. అయ్యో! ఇఁక నాకెవరు దిక్కు! ఏమి సేయుదు! హా! దేవి!

సీ. పంచ భూతములలోఁ బహు పావనంబైన
వసుమతీ దేవి గర్భమునఁ బుట్టి
జలజ సూతి నిభుండు జనక భూమివరుండు
ప్రేమతో నరచేతఁ బెంపఁ బెరిఁగి
అమర నాయకు ప్రక్క సర్ధాసనముఁ గొన్న
యిక్ష్వాకు నృపతుల యిల్లు సొచ్చి
అత్త లందఱుఁ జిత్తానంద కలికవై

రొప్పుల కుప్పనా కెప్పు చెంది

గీ. ఎన్నఁ దేపాపమును జేసి యెఱుఁగనట్టి
శీలవతి నక్కటా! నిన్నుఁ జెనఁటి నగుచు
నడవులకుఁ ద్రోయుచుంటినా హా! విదేహ
రాజపుత్రీ! శరత్పూర్ణ రాజవదన!

హా! అంబా! అరుంధతి! హా! వసిష్ఠా! విశ్వామిత్ర! హా! దేవా! పావక! హా! మాతా! వసుంధర! హా! తాతా! జనకమహారాజ! హా! తండ్రీ! హా! తల్లీ! హా! మహారాజ సుగ్రీవ! హా! సౌమ్యా! హనుమంత! హా! సఖ! విభీషణ! హా! సఖీ! త్రిజటా!

గీ. నమ్మకమ్మునఁ బడి నా యురమ్మునందు
నిదురవోయిన యీ ప్రాణసుదతి నిపుడు
గర్భవతి నక్కటా! యెంత కటిక నగుచు
బలి నొసంగుచుంటిని మాంస భక్షకులకు.

(సీతాదేవి పాదములు శిరముపై నుంచుకొని) హా! దేవి! ఇదే కడసారి నీ చరణారుణాబ్జ స్పర్శము. (ఏడ్చును.)

(తెరలో)

అయ్యయ్యో! అవధ్యులము. బ్రాహ్మణులము. రక్షింపుఁడు! రక్షింపుఁడు.

రా—ఓయీ! ఇదేమిఆర్త నాదము వినవచ్చెడిని?

(తెరలో)

మహారాజా! యమునా తీర నివాసులు మునీశ్వరులు వీరు. లవణాసుర త్రాసితులై మిమ్ము శరణుఁ గోరుచున్నారు.

రా—ఏమీ! ఇంకను రాక్షస భయ మున్నదా? మంచిది. ఇప్పుడే వాని వధించుటకు శత్రుఘ్నుని బంపెద. (కొంచెము నడచి-మరల మరలి) హా! దేవీ! జానకి! భగవతీ! వసుంధర! గుణవంతురాలగు నీ కొమారితను జూచికొనుము. (రోదనముతో నిష్క్రమించు.)

సీత—హా! ఆర్యపుత్ర! ఎక్కడ నున్నావు? (వేగముతో లేచి) అయ్యో! పాడు కల నా నాథు నెడబాసినట్లు వచ్చినది. (అటు నిటుఁ జూచి) అయ్యో యిదేమి!

ఎన్నఁడును లేదు. నా నాథుఁడు నన్నొక్కరితను విడిచిపెట్టి వెళ్ళినాఁడు. కానీ! కనుఁగొన్న పిమ్మట గట్టి ధైర్యము తెచ్చుకొని కోపగించెద. ఎవరక్కడ పరిజనము ?

దుర్ము.—(వచ్చి) దేవీ! రథము సిద్ధమై యున్నదని కుమారలక్ష్మణులు మనవి సేయు మన్నారు.

సీత.—ఇదిగో! వచ్చుచున్నాను. (లేచి పరిక్రమించును.)

దుర్ము.—దేవీ! ఇట్టిటు.

సీత—ఓరీ! నిమ్మళము. నాకు గర్భ భార మదురుచున్నది.

దుర్ము.—చిత్తము.

సీత—రఘుకుల దేవతలకు నమస్కారము. తపోధనులకు వందనము.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ బ్రహ్మానంద విరచితము. ఉత్తర రామ చరితము.

ప్ర థ మా ఙ్క ము.

శ్రీరస్తు.

బ్రహ్మానందీయము.

# ఉత్తరరామచరితము

## ద్వితీయాఙ్కము.

(తెరలో)

తపోధనా! స్వాగతము.

(తరువాత దారి పరికించుచు నొక తాపసి ప్రవేశించు.)

తా—ఓహో! ఫల కుసుమ గర్భ మగు పల్లవార్ఘ్యముతో వనదేవత నన్నుఁ బూజింప వచ్చుచున్నది.

వనదేవత—(వచ్చి అర్ఘ్యమిచ్చి.)

గీ. సుదిన మొంతేనియును నేఁడు సుదిన మెంతొ
పుణ్యమునఁగాని సుజనులఁ బొందు కాదు
వలయునవి యెల్ల నిచ్చోటఁ గలవు తమకు
ననుభవింపుఁడు తమ చేతిఁ గడ్డు లేదు.

తా—ఔను. గీ. పావనము ప్రియప్రాయముఁ వర్తనమ్ము
వినయ మధురము మితము వాఁగ్విలసనమ్ము
ధర్మ నిరతము సుభగ మంఁతరము చెలిమి
సహజమే కదా! సతతముఁ సజ్జనులకు.

వన—అమ్మా! మీ పేరేమి ?

తా—ఆత్రేయి.

వన—ఆర్యా! ఆత్రేయి ఎక్కడనుండి.

ఆత్రే—వాల్మీకుల వారి యొద్దనుండి.

వన—ఎందాఁక ?

ఆ—అగస్త్యులవారి సన్నిధికి.

వన—ఎందుకు ?

ఆ—వేదాంతాధ్యయనము కొఱకు.

వన—అదేమి ? ఎందఱెందఱో మహామును లా వాల్మీకి మహామునుల సన్నిధికే వచ్చి దరే వేదాంతోపదేశముకొఱకు.

ఆ—అవును. అయినను ఇప్పు డక్కడ చేదు వంతగా సాగకున్నది.

వన—ఎందువల్ల ?

ఆ—ఎక్కడనుండియో తేజో విశేష మొకటి అప్పడే తల్లిదగ్గఱఁ బాలు ద్రావుట మానిన యిరువురు బాలకులను దీసికొనివచ్చి వాల్మీకులవారికి నొప్పగించి మాయ మయినది.

వన—వారి పేరేమి ?

ఆ—కుశలవు లని చెప్పుచు నా దేవతయే వారి ప్రభావమును గూడఁ జెప్పినది.

వన—ఆ ప్రభావ మెట్టిది ?

ఆ—అతి రహస్యములగు జృంభకాస్త్రములతో దివ్యాస్త్రము లన్నియు వారికి జన్మ సిద్ధములఁట !

వన—ఇది మహా విచిత్రము.

ఆ—అది మొదలు వాల్మీకులే వారికి సర్వ విధముల సంరక్షకులయి క్షాత్ర కల్ప ప్రకారము గర్భ వర్షముతోఁ గూడఁ బదునొకండవ యేఁట వడుగుఁజేసి సముచితములగు విద్యా బుద్ధులు సర్వముఁ గఱపిరి. ఆహా! యేమి వారి ప్రతిభా విశేషము! గురూపదేశమే తడవు గాని వేఱొక తడవు లేదు. అట్టివారితో మవంబోంట్లకుఁ గలిసి చేదువుకొనుట యెట్లు? అది గాక వాల్మీకి మహాముదు లిప్పుడు రామాయణము రచించుచున్నారు. అది కూడ మాకు మఱి కొంత విఘ్నము.

వన—బాగున్నది.

ఆ—భద్రా ! ఇఁక నాకు దారి చెప్పుము. అగస్త్యాశ్రమమునకుఁ బోయెదను.

వన—ఇదిగో! ఇటు పంచవటినుండి గోదావరి యొడ్డున.

ఆ—(కన్నీటితో) తపోవనమా యిది? ఇది పంచవటియు నిది గోదావరియునా? ఇదో? ఇది ప్రస్రవణాచలమా ? నీవు జనస్థాన వనదేవతవు వాసంతివా?

వ—అవును నేను వాసంతిని. సర్వము సత్యము.

ఆ—హా! వత్సా! జానకీ!

గీ. ప్రేమతో నీవు పెంపఁగాఁ బెరిఁగినట్టి
వృక్ష వర్గము లివి యెల్ల వీనిఁ జూడ
నామమే శేషమై పోయి నను గుమారి!
మరలఁ బ్రత్యక్షమైన ట్లగుమాను నిపుడు.

వాసంతి—(భయపడుచుఁ దనలో) అయ్యో యిదేమి నామశేష మనుచున్నది? (ప్రకాశము) ఆర్యా! ఉపద్రవమా సీతాదేవికి ?

ఆ—ఉపద్రవమే కాదు. అపవాదము కూడను. (ఏదో చెవిలోఁ జెప్పును.)

వా—హా! ఏమి యీ దారుణము! (మూర్ఛిల్లు.)

ఆ—భద్రా! ఏమి లాభము? ఊఱడిల్లుము. లెమ్ము.

వా—(లేచి) హా! ప్రియసఖి! జానకి! ఇదియా నీ నిర్మాణలాభము! అయ్యో! రామభద్ర! నీవుమాత్ర మేమి సేయఁగలవు! ఆర్యా! ఆత్రేయి! అడవిలో విడిచి లక్ష్మణుఁడు వెళ్లిన తరువాత సీతజాడ యేమయినఁ దెలిసినదా ?

ఆ—లేదులేదు. ఏమియును దెలియలేదు.

వా—అవుర! అరుంధతీ వసిష్ఠులు శాసించు రఘు గృహములలోఁ గూడ రాణులు బ్రతికి యుండఁగానే యింత పని యెట్లు జరిగినది?

ఆ—వారెవరును అప్పు డింటి దగ్గఱ లేరు. అల్లుఁడు ఋశ్యశృంగుఁడారంభించిన సత్రమునకుఁ జనిరి. అది యిప్పుడు పరిసమాప్త మైనది. అరుంధతి సీతలేని యయోధ్యకు రానన్నది. రాణులు కూడ మువ్వురు నట్లే నుడివిరి. వారి బలాత్కారమువలన వసిష్ఠునకును దప్పినదికాదు. తుదకు వీరందఱు వాల్మీకులవారి తపోవనములో నివసించుటకు నిశ్చయించుకొనిరి.

వా—ఇప్పు డా రాజో రాముఁ డేమి సేయుచున్నాఁడు ?

ఆ—అశ్వమేధము.

వా—ఛీ! ఛీ! రెండవ పెండ్లి కూడనా ?

ఆ—లేదు లేదు.

వా—మఱి యజ్ఞమందు సహధర్మ చారిణి యెవతె ?

ఆ—బంగారపు సీతా ప్రతిమ.

వా—ఔర ! గీ. వజ్రములకన్నఁ గఠినముల్ వ ర్తనములు
అమృతములకన్నఁ జల్లని వంతరములు
మహిని లోకోత్తరుల నిజ మానసముల
వస్తు తత్వము నెఱుఁగ నెవ్వారి తరము ?

ఆ—వామదేవానుమంత్రితమై వారువము విడువఁబడినది. యథా శాస్త్రముగా సంరక్షకులు నియమింపఁబడిరి. దివ్యాస్త్ర వేదియగు లక్ష్మణ పుత్త్రుఁడు చంద్రకేతువు నియామకుఁడుగాఁ బంపఁబడెను.

వా—(ఆనందబాష్పములతో) సంతోషము. కుమార లక్ష్మణునకుఁగూడఁ గుమారుఁడని వింటిని.

ఆ—ఇంతలో నొక బ్రాహ్మణుఁడు చచ్చిన కొడుకును రాజద్వారమందుంచి యొమ్ము బాఁదుకొనుచు నేడ్చెను. అది చూచి కరుణామయుఁడగు రామభద్రుఁడు రాజాపచారములు లేక యిట్టి విపరీతములు పుట్టవని విచారించుచుండ "శంబూకుఁడను శూద్రుఁడు తపముఁ జేయుచున్నాఁడు. శ్రీరామ! వాని తలఁ ద్రుంచి వీని బ్రతికింపుము" అని యశరీర వాణి యొకటి వినఁబడినది. అది విని రామ భద్రుఁడు కత్తిఁ గైకొని విమానమెక్కి శంబూకుని వెదకుచు బయలుదేఱినాఁడు.

వా—అట్లయిన రాభద్రుఁడు మరల నీ వన మలంకరించు. ఆ శంబూకుఁ డీ జనస్థానమందే తల క్రిందుగాఁ దపము సేయుచున్నాఁడు.

ఆ—ఇఁక నేను వెళ్లెదను.

వా—మిగులఁ బ్రొద్దెక్కినది.

శా. తీరస్థ ద్రుమముల్ కరీంద్ర కషణోత్తి ప్తమ్ములై బంధనా
పూరమ్ముల్ విడి రాలు పుష్పములచేఁ బూజించు గోదావరిన్
జేరెన్ నీడలకున్ మయూరములు వచ్చెన్ గుక్కుటమ్ముల్ వడిన్
దూఱెన్ గ్లాంతములై కపోతములు సంతోషంబుగా గూండ్లలో.

(నిష్క్రమింతురు.)

(పిమ్మట రాముఁడు కత్తి చేతఁబట్టుకొని పుష్పకముతోఁ బ్రవేశించు.)

రా (జాలితో) గీ. సీత నడవికిఁ ద్రోచి కించిత్తు గూడ
జాలి యెఱుఁగని ఓ అపసవ్య కరమ!
ద్వాపరంబేల? రామ గాత్రంబ కావె?
విడువుమా శూద్ర ముని మీఁద నడిద మిఁకను.

(ఎట్లో నఱికి) రామునకుఁ దగిన పని జరిగినది. అయినను బ్రాహ్మణుఁడు బ్రతుకునా?

దివ్య పురుషుఁ డొకఁడు ప్రవేశించు.

పురు—దేవా! జయము!

గీ. శమను భయ మాఁగు నీవు శాసకుఁడ వగుట
మృతుఁడు విప్రుఁడు బ్రతికె నాకికి ప్రవృద్ధి
మ్రొక్కు నీ పాదములకు శంబూకుఁ డితఁడు
శ్రీకరము కాదె సుజనుల చేతి చావు?

రా— ఈరెండును మాకు సంతోషమే. మఱియు వైరాజము లను పుణ్య లోకములు నీకుఁ దపఃఫలములగు!

శంబూ—దేవా! తపములతో నేమి పని? తమదయయే సర్వమునకుఁ గారణము. అయినను అయోధ్యనుండి యీ దండకారణ్యమునకు మిమ్ము రప్పించి తపము లీ యుపకారము నాకుఁ జేసినవి. కాదేని దివ్యమునులకుఁ గూడ దుర్లభమై అయోధ్యలో నున్న తమ రెక్కడ? దండకారణ్యమందున్న శూద్రుఁడను నే నెక్కడ?

రా—ఏమీ! దండకారణ్యమా యిది? (కలయఁ జూచి)

మ. అవె యీ స్నిగ్ధములైన శ్యామల వనాలాభోగ రూక్షమ్ము? ల
య్యవియే యీ సెలయేళ్లునుర్విముఖరితాశాంతమ్ము? లీ యాశ్రమా
లవె? యీ కొండలవే యగస్త్య ముని రాడ్జాక్రాంతముల్? నాఁటివే
యివి యెల్లన్? జిర సంస్తవమ్ము లవియే యీ దండకా భాగముల్?

శంబూ—చిత్తము. ఇక్కడనే దేవర ఖర దూషణాదులను ఖండించినది. అందువల్లనే సిద్ధి క్షేత్ర మగు నీ జనస్థానమున మముబోంట్లు జానపదులు కూడ నిర్భయముగా సంచరించుచున్నారు.

రా—ఏమీ! దండకారణ్యమే కాక యిది జనస్థానము కూడనా?

శంబూ—చిత్తము. పులులతో నిండిన కొండలతో దక్షిణముగా వ్యాపించిన యవి జనస్థాన పర్యంతారణ్యములు. చిత్తగింపుఁడు!

శా. ప్రాంతానుప్త గభీర భోగ భుజగ శ్వాస ప్రదీప్తాగ్ని లీ
కాంతారమ్ములు కందరాంతర మహాగంభీర సత్త్వ స్వనా
క్రాంతమ్ముల్; ప్రతిసూర్యకమ్ములు తృషాక్లాంతమ్ములై చెంతలన్
జింతల్ దీఱఁగ నిచ్ఛతో నజగర స్వేదాంభమున్ గ్రోలెడిన్.

రా—ఔను. ఇక్కడనే పూర్వము ఖరుని యిల్లు. ఆహా! అప్పటి విషయము లన్నియు మరల నా కిప్పుడు కనులకుఁ గట్టినట్లున్నవి. (అటు నిటుఁ జూచి)
ఔర! ఇవి కాఱడవులు. ఇంతకంటె భయ మేమి యుండు? (కన్నీటితో) హా! జానకి! ఎవ్వఁడెఱుఁగు నీ స్నేహము? ఈ యడవులలో నయినను నాతోడ నుండుటకు బ్రహ్మానంద పడితివి.

శంబూ—దేవా! ఇటు చిత్తగింపుఁడు!

సీ. పక్షు లెక్కిన రాలు వానీరములచేత
సురభీకృతమ్ము లీ శుభ్ర నదులు
భల్లూకముల నోటి ధ్వనులచేఁ బ్రతిరావ
కూలంకషమ్ము లీ కొండ గుహలు
పండ్లవ్రేఁగున దిగవంగు నేరేళ్లచే
ముఖరీకృతంబు లీ భూరి ఝరులు
కరులు గ్రంథులఁ దెంపఁ గటు శీత గంధంబు
కలచే నీ సల్లకీ కాననములు

గీ. మేదురములు సాంద్రము లీ నమేరు తరులు
శ్వాపదాక్రాంత భూము లీ ప్రాంతరములు
కాళికా శ్యామలము లీ తమాల ఖనులు
శాంతములు గభీరములు నీ సాంద్ర ఘనులు.

రా—(ఇంచుక నేపూరకుండి) భద్రా! దేవయాన మార్గములు నీకు భద్రయానము లగును. పుణ్య లోకములకుఁ బొమ్ము.

శంబూ—చిత్తము. పురాణ బ్రహ్మవాదు లగు నగస్త్య మహామునుల దర్శనము చేసికొని శాశ్వత పదమునకుఁ జనియెద. (నిష్క్రమించు.)

రా—(కలయఁజూచి)

సీ. ఈ పర్వతము లవేయే పర్వతమ్ములు
 కేకారవములకు నాకరములు
ఈ వనీస్థలు లవేయే వనీస్థలములు
 మద మృగావళులకు మందిరములు
ఈ సరిత్తటు లవేయే సరిత్తటములు
 నీపాంఘ్రిపములకుఁ గాఁపురములు
ఈ ప్రస్రవణ మదేయే ప్రస్రవణ గిరి
 గోదావరికి నను కూల వసతి

గీ. ఈ మహాశిఖరం బదేయే శిఖరము
గృధ్ర రాజేంద్రునకు వసియించు గృహము
ఈ ప్రదేశము లవ్వియేయే ప్రదేశ
ములను మా పర్ణ శాలలు పూర్వమందు.

మఱియు నిది చిర కాలము నివసించుటచే మా వివిధ విస్రంభముల నెఱిఁగిన పంచవటి. ఇక్కడనే ప్రియురాలి ప్రియసఖి వాసంతి యను వన దేవత. అయ్యో! ఏమి సేయుదు!

గీ. ఒక్క పరి తీవ్ర విషము పైఁ గుంబుకినట్లు
కషణమున శల్య శకలము కదలినట్లు
వ్రణ ముపవ్రణ జనకమై పగిలినట్లు
పూర్వ శోకము నూత్నమై పొంగు నిపుడు.

అయినను బూర్వ మిత్రములగు నీ భూభాగములను జూచెద (చూచి) అపుడా! ఆ సర్వమిప్పుడు మాఱినది,

మ. పులినంబై కనుపట్టుఁ బూర్వపు నదీ పూరంబు లిప్పట్టునన్
వెలుతుల్ గుంపులు తాఱుమాఱు లగుచుం వృక్షంబులుం దోఁచునీ

లలి వేఁజన్న భ్రమంబు సేయుఁ జిర కాలంబాటచేఁ జూచి కొం
డలు నమ్మించు నదే యిదంచు నటులైనన్ బ్రాక్తనాభిన్నముల్,

అయ్యో! వెళ్ల వలె నన్నను బంచవటీ స్నేహము వెళ్లనీయకున్నది. (కరుణముతో)

ఉ. జానకితోడ నాకు దివసమ్ములు వెళ్లె క్షణమ్ములై యిటన్
దీని కథాప్రసంగముల నిచ్చలు పాపి నొకండ నిప్పుడ
ద్దానిని దీనిఁ బంచవటిఁ దంత్ర వినాశిత వల్లభుండనై
యే నెటు చూతుఁ? జూడకెటు లేగుదు? నేమి యొనర్తు? నక్కటా!

శంబూ—(మరల వచ్చి) దేవా! జయము! నావలనఁ దమ రాక విని వాత్సల్యమున లోపాముద్ర నీరాజనముతో నెదురు చూచుచున్నది. మహామునులందఱు దర్శన మపేక్షించి యున్నారు. కావున మమ్ము నెల్లర నానంద పఱచి పిమ్మట నశ్వమేధమునకుఁ జేను మని తమ పలుకులుగాఁ జెప్పి మిమ్ముఁ దోడ్కొని రమ్మని భగవంతు లగస్త్యులు సెల విచ్చిరి.

రా—వారి సెలవు ప్రకారము ప్రవర్తింతు.

శంబూ—దేవా! ఇటు.

రా—(పుష్పకమును నడుపుచు) భగవతీ! పంచవటీ! గురుజనోపరోధమున వెళ్లుచున్నాను. ఒక్క క్షణము క్షమింపు!

శంబూ—దేవా! చూడు! చూడు!

మ. కుహరాభ్యంతర గోళ గద్గద నదద్గోదావరీ వారులీ
మహితాగమ్ములు దాక్షిణమ్ములు శిరోమాలాయమానాబ్దముల్
ముహు రన్యోన్య నిపీడ నోచ్ఛల పయఃపూర స్ఫురద్భంగ దు
స్సహ కోలాహల పావనమ్ము లివియున్ సద్వాహినీ సంగముల్.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ బ్రహ్మానంద విరచితము ఉత్తర రామ చరితము.

ద్వితీయాఙ్కము.

శ్రీ ర స్తు.

బ్రహ్మానందీయము.

# ఉత్తరరామచరితము.

## తృతీయాఙ్కము.

పిదప
{తమస — మురళ ప్రవేశింతురు.}

త—సఖీ ! మురళా! ఎందుకో తొందరపడుచున్నట్లున్నావు.

ము—భగవతీ ! తమస ! "సీతాదేవిని విడిచినది మొదలు పట్టరాని విరహ శోకమును లోలోపలనే దిగమ్రింగుచు రామభద్రుఁ డొకనాఁటికంటె నొకనాఁడు మిగులఁగృశించుచున్నాఁడు. ఆయనను జూచినప్పటినుండియు హృదయమునఁ గంపమెత్తుచున్నది. మఱియు మరల నిపు డింటికిఁ జను రామభద్రుఁడు విస్రంభ పాత్రములయిన పంచవటీ ప్రదేశములను త్రోవలోఁ జూడఁగలఁడు. అది మహా ప్రమాదము. అందువల్ల నక్కడ మాటిమాటికిఁ దటస్థించు రామభద్రుని మూర్ఛలను జల్లని తరంగ వాయువులతో వారింపు" మని అగస్త్యులవారి భార్య లోపాముద్ర గోదావరితోఁ జెప్పుమన్నది.

త—బాగున్నది. స్నేహమునకు మెంగమోట ముండవలసినదే. అయినను రామభద్రునకు జీవనోపాయము సిద్ధమై చెంతనే యున్నది. విను. వాల్మీకులవారి తపోవన సమీపమున లక్ష్మణుఁడు విడిచి వెళ్లిన తరువాత సీతాదేవి ప్రసవ వేదన కోర్వలేక గంగా ప్రవాహమున దిగి యిరువురు కొడుకులను గన్నది. గంగాదేవియు భూదేవియును అనుగ్రహించి రసాతలమునకుఁ దీసికొని పోయిరి. పిమ్మట స్తన్యత్యాగానంతర మా బాలురను గంగాదేవి స్వయముగా వాల్మీకులవారికి నొప్పగించినది. అప్పు

డే శంబూక ప్రసంగమునఁ జెప్పిన సరయూ నదివలన రామభద్రుని జనస్థాన గమనమును విని భగవతియగు భాగీరథియు లోపాముద్రవలెనే శంకించుకొని కొండొక నెపమున సీతాదేవిని వెంటఁబెట్టుకొని గోదావరీ తీరమునకు వచ్చినది.

ము.—మంచిపని చేసినది భాగీరథి. అయినను రాచ కార్యము లున్నప్పుడే రామభద్రునకుఁ జిత్త విక్షేపములు మెండు. అట్టి స్థితిలో వేఱొక పని లేక నిరంతరము శోకముననే మునుఁగు నిప్పుడు పంచవటీప్రవేశము గొప్ప యనర్థము. సీతమాత్రము తనంతఁ దాను వచ్చి యెట్లూఱడించు?

త.—ఔను. ఆ విషయము సర్వము భాగీరథియు నట్లే యోజించి సీతను బిల్చి "అమ్మా! జానకి! ఇది కుశలవుల పండ్రెండవ యేఁటి మంగళ గ్రంథి సమయము. కనుక మామయగు సూర్య భగవానులను బూజించుటకుఁ బూవులను స్వయముగాఁ గోసికొనిరమ్ము. భూమి మీఁద సంచరించినను నా ప్రభావమున నీవు నరులకే కాదు సురల కయినను గనఁబడవు." అని చెప్పి "ఓసీ! తమసా నీమీఁద సీతకు విశేషప్రేమ. కావున నీవు కూడ సాయము పొ"మ్మని నాకుఁ జెప్పినది. ఇఁక నేను వెళ్లెదను.

ము.—మంచిది, ఈవృత్తాంతము నేనును వెళ్లి లోపాముద్రకుఁ జెప్పెదను.

త.—అదిగో! గోదావరీ ప్రవాహమునుండి-

గీ. పాండురంబైన శ్రీగండ పాళితోడ
భారమై వీడు కచ కలాపముతోడ
రూపు వడసిన విరహ సంతాప మనఁగ
నచ్చుచున్నది వైదేహి వనమునకును.

(నిష్క్రమింతురు.)

(తెరలో) అయ్యో! ప్రమాదము.

(పూవులు కోయు సీత సంభ్రమముతో వినుచుఁ బ్రవేశించు.)

సీత—తెలిసినది. ఇది నా ప్రియసఖి వాసంతి కంఠస్వరము.

(తెరలో)

గీ. సల్లకీ పల్లవాగ్రముల్ జనక తనయ
చేతఁ దినిపించి దేనిఁ బోషించె మున్ను

సీత—దానికేమి?

(తెరలో)

కరిణితో నీటఁ దిరుగు నాఁకలభకమును
గుంజరము వేఱొకండు డీకొనియె నిపుడు.

సీత—(వడివడిఁ గొన్నియడుగులు నడచి) ఆర్యపుత్రా! రక్షింపు! రక్షింపు! అయ్యో యింకను నాకుఁ బంచవటీ దర్శనమున వెనుకటి యలవాటు!

తమస—(వచ్చి) వత్సా! వైదేహీ! దుఃఖింపకు.

(తెరలో) విమానమా! ఇక్కడ నిలువుము.

సీత—(భయపడుచే నుల్లాసముతో) ఎక్కడనో కాని వర్షాకాల మేఘ ముఱిమినట్లు గంభీర మయిన యీ కంఠస్వరము నా కర్ణ వివరముఁ జొచ్చి తహ తహ పెట్టుచున్నది.

త—(చిఱునవ్వుతోఁ గన్నీరు మెలపుచు) వత్సా! ఏదో తెలియని ధ్వని విని ఉఱుమునకు మయూరివలె నీవు కూడ నుత్కంఠపడెద వేమి?

సీత—అమ్మా! భగవతి! తెలియకేమి? అది నే నెఱుఁగుదు. ఆస్వర మార్యపుత్రునిది.

త—తపము సేయుచున్న శూద్రుని దండించుటకు సూర్య వంశపు రాజొ జనస్థానమునకు వచ్చెనని వించున్నాము.

సీత—అవును. వారెన్నఁడును ధర్మము తప్పరు.

(తెరలో)

గీ. చుట్టములు చెట్లు మృగము లెచ్చోట నాకు
జీవితేశ్వరితో నుంటిఁ జిరము మఱియు
అవియె గోదావరీ తీరమందు నున్న
గుహాలు సెలయేళ్లు షాలుచు నీకొండ లెల్ల.

సీత—ప్రాతఃకాల చంద్రమండలమట్లు పాలిపోయి కృశించియు సహజమయిన సౌమ్య గంభీరానుభావమున గుర్తింపఁ దగిన యీతఁ డార్యపుత్రుఁడు. అయ్యో! ఏమి సేయుదు! అమ్మా! తమసా! (తమసను గౌఁగిలించుకొని మూర్ఛిల్లును.)

త—(పట్టుకొని) అమ్మా! ఊఱడిల్లుము.

(తెరలో)

గీ. ఔర! యిందాక లోపల ♦ నణఁగి యుండి
పంచవటి దర్శనమ్మున ♦ భగ్గు మనెడు
దుఃఖ తీవ్రాగ్ని ధూమంపుఁ ♦ ద్రోవ యనఁగ
మొల్లమై ముంచుకొనిని నన్ను ♦ మోహ మిపుడు.

హా! దండకారణ్యప్రియసఖీ! జానకీ! (మూర్ఛిల్లు.)

సీ—హా! కష్టము. ఆర్యపుత్రుఁ డీ నిర్భాగ్యురాలినే పిలుచుచు మూర్ఛిల్లినాఁడు. అయ్యో! భగవతీ! రక్షింపుము! (పాదములమీఁదఁ బడు.)

త—బిడ్డా! జానకీ! భయపడకు లెమ్ము.

గీ. ఏను రక్షింపఁగా నేల? ♦ యిందు వదన!
చాలదే నీ కరస్పర్శ ♦ చెల్లఁదనము?
మూఁడు లోకమ్ములను బ్రోచు ♦ పుణ్య నిధిని
నీవె బ్రతికింపు కల్యాణి! ♦ నీదు విభుని.

సీత—కాఁ దలఁచినది కాక మానదు. ఏమయినను సరే. (సంభ్రమముతో లేచి పరుగెత్తు.)

పిదప
భూమిపై మూర్ఛిల్లిన రాముఁడు - కన్నీటితో రాముని స్పృశించు సీత కనుపట్టుదురు.

రా—(ఆనందముతో నూపిరి విడుచు.)

సీత—(ఇంచుక సంతోషముతో) ముజ్జగమ్ములకు మరల నిప్పుడు ప్రాణములు వచ్చినవి.

రా—(ఆశ్చర్యముతో) గీ. జీవనౌషధు లురమునఁ ♦ జేర్చినట్లు
చంద్ర కిరణామృతము మీఁదఁ ♦ జల్లినట్లు
అవుర! యిది యేమి చిత్రమో! ♦ అవుర! విశిచి
చెదరి పోయిన ప్రాణాలు ♦ చేరె మరల.

ప్రాణప్రదమై యానంద ప్రదమగు నీస్పర్శ మేదో పూర్వ మనుభవించినదే.

సీత—(తొలఁగి) చాలు. ఇప్పుడిదే గొప్ప విశేషము.

రా—(కూర్చుండి) వాత్సల్యమున దేవి రాలేదుగద! అయినను జూచెదను.

సీత—అయ్యో! ఆర్యపుత్రుఁడు నన్నే పేర్కొనుచున్నాఁడు. భగవతీ! తమస! చూచె నేని సెలవు లేని యీ నా రాకను మిక్కిలి కోపించు. ఆవలకుఁ బోవుదము. రమ్ము.

త—బిడ్డా! భయపడకు. భాగీరథీ వరమున వనదేవతలకయినను నీవు కనఁబడవు.

సీత—అవును. అలాగే.

రా—ప్రేయసీ! జానకీ!

సీత—(డగ్గుత్తికతో—భయపడుచు) ఆర్యపుత్రా! దీని కిది తగదు. అయ్యో! నాపై నింత వాత్సల్యము గల యీయనపై నే నేమని కోపింతు? శ్రీహరీ! అన్య్య లెవ రెఱుఁగుదురు? ఆయన హృదయము నేనే యెఱుఁగుదును. నాహృదయ మాయనయే యెఱుఁగు.

రా—(కలయఁజూచి) హా! ఎవతెయు లేదు.

సీత—అమ్మా! నన్ను నిష్కారణముగా విడిచిపెట్టిన యీయనను జూచుటవలన నా హృదయ మెట్లుండును?

త—అవును. అలాగే.

రా—గీ. సరసమై రూపు గల సుప్రసాద మనఁగ
స్నేహ శీతలమైన నీచేతి స్పర్శ
నాదు చేత మిప్పటికి నానందపఱుచుఁ
గాని జానకీ! నీవెందుఁ గానరావు.

సీత—అమృతపుగుళిక లార్యపుత్రుని పలుకులు.

రా—అయ్యో! ఇఁక నెక్కడి ప్రియురాలు! ఈ సర్వము రామునకు భ్రాంతి.

(తెరలో) అనుగ్రహింపుఁడు! అనుగ్రహింపుఁడు!

గీ. సల్లకీ పల్లవాగ్రముల్ జనకతనయ
చేతఁ దినిపించి దేనిఁ బోషించె మున్ను

రా—(కరుణతో) దానికేమి?

(తెరలో) గీ. కరిణితో నీటఁ దిరుగు నా కలభకమును
గుంజరము వేఱొకండు ఢీకొనియె నిపుడు.

సీత—అయ్యో! ఇప్పు డేది ఢీకొన్నది?

రా—ఏదీ యెక్కడ నున్నది ఆ ఢీకొన్న దుష్టగజము? (లేచును.)

వాసంతి—(వచ్చి) ఓహో! ఇదేమి! దేవుఁడు రఘునందనుఁడు.

సీత—హా! నా ప్రియసఖి వాసంతి.

వా—దేవా! జయము!

రా—ఓహో! దేవీప్రియసఖి వాసంతి.

వా—దేవా! త్వరపడుము. ఇదిగో! ఇటు జటాయు శిఖరమునకు దక్షిణముగా సీతాతీర్థమునుండి గోదావరిని దాఁటి దేవి పుత్రప్రేమతోఁ బెంచిన కలభమును గాపాడవలయును.

సీత—హా! తండ్రీ! జటాయూ! నీవు లేని జనస్థానము జనస్థానము కాదు.

రా—అయ్యో! ఏమి సేయుదు! ఈ కథా ప్రసంగములకు గుండెలు పగులు.

వా—దేవా! ఇటు.

సీత—అమ్మా! తమస! నీవు నిజము చెప్పు. వనదేవతకయినను నేను గనఁబడనుగద?

త—బిడ్డా! ఎందుకు నీకీ సందేహము? అందఱు మహిమకంటెను మందాకిని మహిమ మహా మహిమ.

సీత—అట్లయిన మనము కూడ వెళ్లుదము.

(పరిక్రమింతురు.)

రా—భగవతీ! గోదావరి! నమస్కారము.

వా—దేవా! సంతోషము. దేవి పెంచిన కలభము వధూ ద్వితీయమై శత్రుగజమును దఱిమి వచ్చినది.

రా—ఆనందము.

సీత—ఇది యిట్లయినది యిక్కడ. అక్కడఁ గుశలవు లెట్లుండిరో!

త—ఇక్కడ దీనివలెనే అక్కడ వారును.

సీత—అయ్యో! నే నెంత నిర్భాగ్యురాలను. ఆర్యపుత్ర విరహముతోపాటు పుత్రవిరహముకూడనా!

త—భవితవ్యమున కెవ రేమి సేయఁగలరు?

సీత—అయ్యో! ఎందుకు వచ్చిన కాన్పు నా కాన్పు! తండ్రి పిల్లల మోము ముద్దు వెట్టుకొనఁ జూచుటకు నోఁచనైతిని.

త—బిడ్డా! వగవకు, దైవానుగ్రహమున సర్వ మనుకూలమగు.

వా—దేవా! ఇటు చూడుము. ఇదిగో! ఇది నీ ప్రియురాలు పెంచిన నెమిలి. కడిమి చెట్టుపై నెక్కి కాంతతోఁ గేక వేయుచున్నది.

సీత—(ఆనందాశ్రువులతో) అవును. అదే యిది.

రా—ఆహా! తిర్యగ్జంతువులును బరిచయము ననుసరించుచున్నవి. ఇది దేవిని మఱచిపోలేదు. ఈ కడిమిచెట్టు కూడ నా ప్రియురాలు పెంచినదే. అందువల్లనే యీ నెమిలి తన బంధుగునువలె జోచుకొనుచున్నది.

సీత—(నిట్టూర్చి...కన్నీటితో) ఆర్యపుత్రున కిది యింకను జ్ఞాపక మున్నది.

వా—దేవా! ఇక్కడఁ గూర్చుండుము. ఇది తమ యాశ్రమ పదము.

రా—(కూర్చుండును.)

వా—మహారాజా! కుశలమా కుమార లక్ష్మణునకు?

రా—(వినిపించుకొనక.)

గీ. నీరు నీవారములు తృణాంకురములును
బెట్టి పోషించె మైథిలి వేని మున్ను
అవుర! ఆచెట్టు లాపిట్టలా మృగాలె
యకట! చూడంగ గుండె నీరవుచునుండె.

వా—ఓయీ! మహారాజా! లక్ష్మణుని కుశల మడుగుచున్నాను.

రా—(తనలో) అవుర! మహారాజా యని నిష్ప్రణయముగాఁ బిల్చుచున్నది. మఱియుఁ గన్నీటితోఁ దొట్రుపడుచు సౌమిత్రి కుశల మడుగుచున్నది. ఈమెకు సీతావృత్తాంతము తెలిసి యుండును. (ప్రకాశము) ఆ. కుమారలక్ష్మణునకుఁ గుశలము.

వా—(కన్నీటితో) దేవా! ఎంత దారుణమైన పనిఁ జేసితివి!

సీత—సఖీ! ఎందుకిట్లనెదవు? ఆర్యపుత్రుఁ డందఱకును బూజ్యుఁడు. అందును నా ప్రియసఖికి నీకు విశేషించి.

వా—మ. కలికీ! యంచుఁ జెలీ! యటంచుఁ జెలువా! కాంతా! యటంచున్
గడున్, బిలుపుల్ పిల్చుచునాడ్వ గంజనమునా ప్రేమానుపూజంబు
నా, లలినా దేహము నాదుజీవమనుచున్ లాలించి హా! దానినే
చెలియన్ ముగ్ధను జోటునింకనుగతింశించెంగా సమస్తంబునున్.

(మూర్ఛిల్లును.)

రా—(ఊఱడించె.)

వా—(ఊఱడిల్లి) దేవా! ఈ యకార్య మేల చేసితివి ?

రా—ఏమి సేయుదు ? లోకమునకిష్టములేదు.

వా—ఎందువల్ల ?

రా—ఏమో. అదిలోకమునకే యెఱుక.

వా—ఓయీ కఠోర యశమే కద నీకుఁ బ్రియము? ఇంతకంటె నపయశమేమి యుండు? కాఱడవిలోఁ గాతరాక్షి యేమగునని యనుకొనెదవు ?

సీత—ఓసీ! వాసంతి! నీవే కఠినురాలవు. దుఃఖించు నార్యపుత్రుని మఱింత దుఃఖ పెట్టుచున్నావు.

త—అదిమాత్ర మేమిసేయు! ప్రణయ శోకము లట్లు సేయుచున్నవి.

రా—అనుకొనుటకేమున్నది ?

ఆ. బాలబిసముకన్నఁ బండువెన్నెలకన్న
నెలలు నిండి యుంటవలన మిగుల
మెత్తనయిన లలనమేను గాఱ్ఱెకముల
పాలు సేసినాఁడఁ బాపి నకట !

వా—దేవా! ఇది మీ దంపతుల పవళించిన శిలాతలము. ఇక్కడ తఱచుగ గడ్డిపరకలు నోటి కందించు సీత చుట్టును లేడి పిల్లలు మూఁగుచుండునవి.

రా—నే నిది చూడలేను. (రోదనముతో వేఱొక ప్రక్కకుఁ దిరిగి చేదికిలఁబడు.)

సీత—ఓసీ! వాసంతి! ఎంత పని చేసితివి! అయయో! ఆర్యపుత్రునకే కాక, యిది నాకును అట్లే యున్నది. ఆయార్యపుత్రుఁడే, ఆవనమే, ఆప్రియసఖియే, ఆగోదావరీతీరములే, ఆమృగములే, ఆపిట్టలే, ఆచెట్లులే, అయ్యయ్యో! ఆసర్వమే నాకేమియుఁ గాకున్నది.

వా—మ. తెరులారా! కయిసేయుఁడీ సుమఫలోదారంపు టర్ఘ్యంబులన్
మరుదంకూరములార! రండు వికచాంభస్సూతి గంధంబుతో
సరసగ్రీవ ఖగమ్ములార! గళముల్ సారింపుఁడీ; రాఘవుం
డరుదెంచెన్ దనయంత వెండియును దానై యిప్పుడీ కాననకున్.

రా—సఖీ! వాసంతి! రమ్ము. కూర్చుండుము.

వా—(కూర్చుండు.)

రా—(కన్నీటితో) ఇఁక నేమి యున్నది ?

ఆ. బాల బిసము కన్నఁ బండు వెన్నెలకన్న
నెలలు నిండి యుంట వలన మిగుల
మెత్తనయిన చెలువ మేను కాత్మకముల
పాలుఁ జేసినాఁడఁ బాపి నకట !.

సీత—లేదు. లేదు. జీవించి యున్నాను.

రా—హా! ప్రేయసీ! జానకీ!

సీత—అయ్యో! ఆర్యపుత్రుఁ డన్యునట్లు కంఠమెత్తి వాపోవుచున్నాఁడు.

త—ఏమి సేయును. అదే దానికి మందు. దుఃఖమునకు దుఃఖించుటే ప్రతిక్రియ. అందును రామభద్రునకు విశేషించి.

శా. ఈ విశ్వంబఖిలంబు పాల్యమగు నందే నిల్చు చేతమ్ముతో;
జీవమ్మున్ హృదయేశ్వరీ వ్యథ కదుర్ చేదించి సంతప్తమున్
గావించున్; దనయంత నే విఁకుచుటన్ గన్పట్టదే త్రోవయున్;
భాష్పోచ్ఛ్వాసము లైన; రోదనమె లాభం బెంతయున్ దానికిన్.

రా—హా! కష్టము.

మ. పగులున్ డెందము రెండు కాదు; వికలప్రాయమ్ము కాయమ్మునున్
నొగులున్ మోహమునొందిజ్ఞప్తికిఁ గదున్ దూరంబు కాదక్కటా!
రగులున్ దాహము బుగ్గిసేయదు శరీరమ్మున్; నృశంసాత్ముఁడై
తగులున్ గోయుచు మర్మమున్ విధియునున్ దాఁ గోయఁడీ జీవమున్.

ఓహో! పౌర జానపదులారా!

మ. అనభీష్టమ్ము విదేహరాజసుత గేహంబాదుఁ దానుంట మీ
కనుచున్ గానకుఁ ద్రోసివేసితిని; మీకేటైననున్ జాలి లే;
దనయంబున్ విలపింపఁ జేయు నిటు లాయాభావముల్; దీనికిన్
గనలం బోకుఁడు; దిక్కు లేదు మఱి శోకంబున్ వినా యేదియున్.

వా—దేవా! గతించిన దాని కేమి చేసెదవు? ధైర్యము తెచ్చుకొనుము.

రా—సఖీ! కాకేమి?

గీ. ద్వాదశాబ్దంబు దేవినిఁ వదలి జగతి
నామమును వినఁబడదు ప్రణష్ట మట్లు
కటకటా! రాముఁ డట్లైనఁ గటిక తాను
ప్రాణములతోడ లేఁ డన్నఁ బలుకు లేదు.

అయ్యో! ఏమి సేయుదు! ఎంత రాయి చేసికొన్నను గుండె నీరవుచున్నది.

సీ—అయ్యో! ఆర్యపుత్రుని దుఃఖవేగమున నాగుండెలు పగులుచున్నవి.

వా—(తనలో) కష్టము. అత్యాసక్తుఁడై దేవర మహా దుఃఖమున మునిఁగినాఁడు. అగుఁగాక! వేఱొక విషయమునకు మరలింతు. (ప్రకాశము) దేవా! ఇదిగో! చిర పరిచితము లయిన యీజనస్థాన భాగములను దిలకించి మన్నింపుఁడు!

రా—మంచిది.

(ఇరువురును బరిక్రమింతురు)

సీ—అయ్యో! చెలి చేసిన యీ వినోదోపాయముకూడ మఱింత దుఃఖమునకే యగు.

వా—(జాలితో) దేవా! దేవ!

శా. నీ విందుంటివి యీ లతా గృహమునం దే దేవి యేతెంచెడుం
ద్రోవన్ జూచుచు నా విదేహ సుతయున్ గోదావరీ భూములన్
దావీక్షించుచు హంసలన్ నిలఁబడెన్; దర్వాత నేతెంచుచున్
గావించెన్ నినుఁ జూచి వేగమె నమస్కారాంజలిన్ భీతయై.

సీ—ఓసీ! వాసంతి! ఎంత కఠినురాలవే! మర్మముల నొరయు మాటలతో మరల నన్నే ఆర్యపుత్రునకు స్మరణకుఁ దెప్పించుచున్నావు.

రా—చండీ! జానకి! కనఁబడుచుంటివి కాని కరుణింపవు! హా! దేవీ! గుండెలు పగులుచున్నవి. సంధులు తెగుచున్నవి. అయ్యో! ఏమి సేయుదు! (మూర్ఛిల్లు.)

సీ—అయ్యయ్యో! ఆర్యపుత్రుఁడు మరల మూర్ఛిల్లినాఁడు.

వా—దేవా!

సీ—అయ్యో! ఆర్యపుత్ర! సకల లోక మంగళాధారమగు నీ జన్మలాభ మీ నిర్భాగ్యురాలి మూలమున మాటిమాటికి సంశయాస్పద మగుచున్నది. హా! చచ్చితిని. (మూర్ఛిల్లు.)

త—అమ్మా! ఊఱడిల్లుము. నీ కరస్పర్శమే మరల రామభద్రునకు జీవనోపాయము.

వా—అయ్యో! కష్టము. ఇంకను ఊపిరి రాకున్నది. హా! చెలీ! సీతా! ఎందున్నావు? వచ్చి ప్రాణేశ్వరుని బ్రదికింపు.

సీ—(సంభ్రమముతో సమీపించి హృదయము లలాటము స్పృశించు.)

వా—(ఆనందముతో) దైవవశమున రామభద్రుఁడు మరల బ్రతికినాఁడు.

రా—మ. అమృతాసారము వచ్చినట్టు లహహా! యంతర్బహిర్నాడులన్
రమణీయం బెదొ జీవనప్రదము ప్రాణంబుల్ గరస్పర్శ గా
త్రములందుల్ మొలపించె వెండియును సాంద్రంబైనయానంద
మున్, వినులంబుల్ బొడమించెఁ జొంపెడు నహో! వేఱొక్క
మోహంబునున్.

(కనులు తెఱవకయే - ఆనందముతో) సఖీ! వాసంతి! అదృష్టమున వర్ధిల్లితివి.

వా—దేవా! అదేమి?

రా—ఏమున్నది? జానకి దొరకినది.

వా—ఏదీ? యెక్కడ?

రా—(స్పర్శసుఖ మభినయించి) ఇదిగో! ఇక్కడనే.

వా—అయ్యో! రామభద్ర! మర్మచ్ఛేదములగు ప్రలాపములతో మరల నన్ను మఱింత తపింపఁజేయుచున్నావు.

సీ—తొలఁగిపోవలయుననుకొన్నను జిరస్నేహ శీతల మయిన యార్యపుత్రుని కరస్పర్శముచే వజ్రటంక మతికినట్లు బిగిసి నా చేయి యూడిరాకున్నది.

రా—సఖీ! ప్రలాపములు గావు.

గీ. కంకణముఁ దాల్చిన సుధాంశుకలిక యైన
యే కరము పెండ్లివేళ గ్రహించినాఁడ
మరల లవలీ దళ నిభంబు మంజుళంబు
హస్తమునఁ జిక్కినది యప్పు డా కరంబె.

(చేయి పట్టుకొను.)

సీ—అయ్యో! ప్రమాదము. మోహవశమున భంగపడితి.

రా—సఖీ! వాసంతి! ఆనంద వశమునఁ బట్టుకొనలేకున్నాను. నీవు కూడఁ బట్టుకొనుము.

సీ—(చేయి యూడఁదీసికొని సంభ్రమముతో వెళ్లు.)

రా—హాహా! ప్రమాదము. నా చేతిలోనుండి దాని చేయి జాఱి పోయినది.

సీ—ఔర! ఇంకను నా మనస్సు కుదురు పడకున్నది. ఏ మనుకొనునో తమస! సిగ్గవుచున్నది.

త—(స్నేహమునఁ జిఱునవ్వు నవ్వుచు సంతోషముతోఁ జూచి) ప్రియస్పర్శసుఖమునఁ జెమటపట్టి గగుర్పొడిచి కంపించు బిడ్డ శరీరము వాన కురిసి వెలిసినపిమ్మట గాలికిఁ జలించు మొగ్గతొడిగిన కడిమిచెట్టు ననుకరించెడిని.

రా—(అంతటఁ జూచి) హా! ఇదేమి? ఎక్కడను గనఁబడదు. హా! దేవీ! వైదేహీ! ఎందున్నావు? ఇది నీకుఁ దగదు. నన్ను విడువకు! అనుగ్రహింపు!

సీ—ఆర్యపుత్ర! కేవలము విరుద్ధము. నీవే నన్ను విడిచితివి.

వా—దేవా! ధైర్యము తెచ్చుకొని మనసు కుదురుపఱచుకొనుము. ఇందేలయుండు నా ప్రియసఖి?

రా—నిజముగా లేదు కాఁబోలును. లేకున్న వాసంతికినిఁ గనఁబడదా? కలకాదుకద? అయ్యో! రామునకు నిద్ర యెట్లు? సర్వము భ్రమ.

సీత—అయ్యో! దారుణముగా నే నార్యపుత్రుని వంచించితి.

వా—దేవా!

మ. అదిగో! క్రుద్ధ జటాయు పాద నిహతంబా రావణస్యందనం
బదిగో! కీకస శేషముల్ రథ పిశాచాస్యాంక బాలేయముల్
కదనోద్భిన్న జటాయు పక్ష మదిగో గర్భస్ఫురద్విద్యుదం
బుద మట్లిచ్చట నే దశాస్యుఁ డెగె రేఖా భూపుత్రితో మింటికిన్.

సీత—(భయముతో) ఆర్యపుత్రా! రక్షింపుము! రక్షింపుము! తాతను జంపుచున్నాఁడు.

రా—(వేగముతో లేచి) ఓరీ! పాపీ! నిలు. నిలు.

వా—దేవా! రాక్షసదావ! ఇంకను నీ కోపమునకు గుఱి యున్నదా?

సీత—అవురా! ఎంత భ్రాంతి కలిగినది!

రా—అకటా! ఇప్పుడిది వేఱొకటి.

చ. అరి మరణంబు దాని కొక హద్దుగ నుండుటచే వినోదపుం
దరణుల నూఁతఁ జేసికొని దాఁటితి నాఁటి ప్రియా వియోగమున్
మఱి యిపు డట్లు కాదు మఱుమాట వచింపక సైచుకోవలెన్
నిరవధి హద్దు లేదుగద నేఁటి ప్రియా విరహాగ్ని కెంతయున్.

సీత—అయ్యో! నిరవధి యనుటవలన నిది పూర్వమువలె గౌరవమునకుఁ గాక నా యాశ లణఁచుచున్నది.

రా—అవురా కష్టము!

మ. పనికే రాదు కపీంద్ర సఖ్య మెచటన్ ప్రజ్ఞా విశేషంబులన్
గనుగోఁ జాలఁడు జాంబవంతుఁ డెచటన్ సామీరికిన్ మార్గముల్
చేన వెచ్చోటను జేయలేఁడు నలుఁడున్ సౌమిత్రి బాణంబులున్
జేను దేరంగను లేని చోటనచటన్ శ్యామాంగి! యెందుంటివో!

సఖీ! వాసంతి! దుఃఖమునకే మిత్రుల కిప్పుడు రామదర్శనము. ఎంత సేపని యేడిపింతును? సెలవిమ్ము. పోయెదను.

సీత—(తమసను గౌఁగిలించుకొని) అమ్మా! ఆర్యపుత్రుఁడు వెళ్లుచున్నాఁడు.

త—బిడ్డా! వగవకు. మనమును ఆయుష్మంతులగు కుశలవుల మంగళగ్రంథి మహోత్సవము గావించుటకు భాగీరథీ పాద సమీపమునకుఁ బోవుదము.

సీత—అమ్మా! అనుగ్రహింపు. చూచెదను. క్షణకాలమైనను మరల దుర్లభము.

రా—ఇపుడు మా కశ్వమేధ సహధర్మచారిణి కలదు.

వా—పెండ్లికూడనా?

రా—కాదు కాదు బంగారపు సీతా ప్రతిమ.

సీత—ఆర్యపుత్రా! నీవిప్పు డార్యపుత్రుఁడవు. ఆహా! నాపరిత్యాగ శల్య మూడఁదీసితివి.

రా—కన్నీరు గ్రమ్ము నా కనుల కదే వినోదము.

సీత—ఆర్యపుత్రుఁ డిట్లు బహూకరించు నా ప్రతిమ మిగుల ధన్యురాలు.

త—(ఆనందబాష్పముతో) బిడ్డా! నిన్ను నీవు పొగడుకొనుచున్నావు.

సీత—(సిగ్గుపడు.)

వా—దేవా! ఇది మాకు మహాప్రసాదము. అయినను కార్యభంగము కాఁగూడదు.

సీత—అయ్యో! వాసంతికూడ నా కిప్పుడు ప్రతికూల యయినది.

త—బిడ్డా! రమ్ము. పోవుదము.

సీత—ఊఁ.

త—ఎట్లు రాఁగలవు!

గీ. ఆసచే దీర్ఘమై తీఁగలట్లు సాఁగి
విభునిపై నాటుకొన్న నీ వీక్షణములు
వెల్చిన బలాత్కరించి మరల్చుకొన్న
మరలకున్నవి గద యిప్డు మదిర నయన!

సీత—బహు పుణ్య దర్శనీయము లార్యపుత్రుని పాదపద్మములకు నమస్కారము.

(మూర్ఛిల్లు.)

త—అమ్మా! ఊఱడిల్లుము.

సీత—(ఊఱడిల్లి) మేఘముల నడుమఁ బూర్ణ చంద్ర దర్శన మెంతవఱకు?

త—అవురా సంఘటనము!

గీ. నీర మొకఁడయ్యు వేఱ్వేఱు కారణముల
సుడులు బుడగలు తరఁగలై యుడరినట్లు
కరుణ మొకఁడే రసము భిన్న కారణములఁ
బడయుచున్నది వేఱు వివర్తములను.

రా—విమానరాజా! ఇట్టిటు.

(అందఱును లేతురు.)

{ తమస—(సీతనుగూర్చి)
{ వాసంతి—(రామునిఁగూర్చి) }

గీ. రత్నగర్భయు గగన తరంగిణియును
భాస్కరుండు నరుంధతీవల్లభుఁడును
మఱియు మము బోంట్లతో పాటు మఱవ కెపుడు
కడు శుభప్రదు లవుదురు గాక మీకు!

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ బ్రహ్మానంద విరచితము. ఉత్తర రామ చరితము.

తృతీయాఙ్కము.

శ్రీరస్తు.

బ్రహ్మానందీయము.

# ఉత్తరరామచరితము

## చతుర్థాఙ్కము.

(ఇద్దఱు తాపసులు ప్రవేశింతురు.)

ఒకఁడు—సౌధాతకీ! ఇప్పుడు మన వాల్మీకులవారి యాశ్రమమునందు విందులకు వండు వంటల సంరంభమును జూడుము.

శా. నీవారాన్నపుగంజి నార్ద్ర తరుణీకి నిష్పీత శేషమ్మునున్
ద్రావున్ దాను తపోవనీ మృగ మొగిన్ కి హైయంగవీనాన్నపు
దావుల్ తోడుపడంగ శాక పచనార్థ వ్యంజన ద్రవ్యపు
భావంబున్ గను రేఁగుపండ్ల గుబులున్ కివహ్వా! గుబాళించెనున్.

సౌధాతకి—అవునయ్యా, దాండాయన! అనధ్యాయ కారణములయిన యీ తెల్లగడ్డముల రాక నాకు బహు సంతోషము.

దాం—(నవ్వి) నీ సంతోషమునకు నేఁడు మంచి కారణము దొరకినది.

సౌ—(ఉపహాసముతో) అవునుగాని మఱి యిప్పుడీ స్త్రీ తండాను వెంటఁబెట్టుకొని వచ్చిన జడదారి యెవరు?

దాం—చాలుఁజాలు. ఎవరనుకొన్నావాయన? అరుంధతిని బురస్కరించుకొని దశరథ మహారాజుగారి ధర్మదారలను ఋశ్యశృంగాశ్రమమునుండి తీసికొనివచ్చిన వసిష్ఠ మహాముని.

సౌ—వసిష్ఠుఁడా! నే నేదో పెద్దపులి యనుకొన్నాను. ఏమందువా? ఆయన రాఁగానే మన పుల్లావుపెయ్యపని మడమడ్డలాడినది.

దాం—అవును. ధర్మశాస్త్రప్రకారము గృహమేధులు తమ యింటికివచ్చిన శ్రోత్రియునకుఁ బెద్ద యెద్దునో చిన్న పెయ్యనో వండి పెట్టెదరు.

సౌ—సరే. దొరకినావు. అప్పుడే వసిష్ఠుఁడు వచ్చేటకు ముందు రాజర్షియగు జనక మహారాజుకూడ వచ్చినాఁడు. ఆయనకు వాల్మీకులవారు దధి మధువులతోనే మధుపర్కమిచ్చినారు కాని పెయ్యజోలికిఁ బోలేదు.

దాం— అవునవును. మాంసము తినని వారి కా పద్ధతియును గలదు. జనకుఁడు మాంసము తినఁడు. సీతాదేవికి వచ్చిన కష్టమును విని వానప్రస్థుఁడై చంద్రద్వీప తపోవనమునఁ దపస్సు చేసికొనుచున్న యీయన కిట్లై కొన్ని యేండ్లు కడచినవి.

సౌ— అక్కడనుండి యిప్పు డిక్కడ కెందుకు వచ్చినట్లు ?

దాం—ఇప్పుడును దన ప్రియ మిత్రుఁడయిన వాల్మీకి మహామునిని జూచుటకు.

సౌ—సంబంధము గల బంధువులు చూచిరో ? లేదో ?

దాం—ఆ విషయ మిప్పుడే అరుంధతితోఁ జెప్పి వసిష్ఠులు కౌసల్యకుఁ గబురంపిరి.

సౌ—ఏమని ?

దాం—స్వయముగా వచ్చి జనకుని జూడుమని.

సౌ—బాగున్నది. ఇప్పుడీ ముదుసళ్లందఱుఁ గలసికొన్నట్లు మనమును సబ్రహ్మచారులయిన బ్రహ్మచారులను గలసికొని యీ యనధ్యయన మహోత్సవము కోలాహలముగా నాటలతో వెళ్లింతము. ఇప్పుడు జనకుఁ డెందున్నాఁడు ?

దాం—వాల్మీకి వసిష్ఠులను సేవించి వచ్చి యిక్కడనే ఆశ్రమమునకు వెలుపల నున్న చెట్టు మొదలఁ గూర్చున్నాఁడు.

గీ. పట్టరానట్టి సీతా వియోగ తీవ్రవలనఁ
బరి తపించుచు నున్నాఁడు యీ పాప మితఁడు !
లోపల దహించు స్వాహా వియోలోలువలనఁ
జేవ చెడి పుల్ల విఱిగిన యీ చెట్టు పగిది.

(నిష్క్రమింతురు.)

పిదప
జనకుఁడు ప్రవేశించు.

జ—మ. కలిగెన్ బిడ్డకు లేని పోనిది నిందోకా రాని దంచున్ మదిన్
బలవంతమ్మయి క్షోభపెట్టు వ్యథచేఁ యీ వర్షా నదీ ప్రాయమై
కలుషంబై ప్రవహించు దుఃఖము విషాదాగారంపుఁ జేలంపమై
కలకాలం బాకటే విధాన నకటా ! యీ కారించు మర్మంబులన్

అపుర ! జరచేతను దుస్సహమైన దుఃఖముచేతను గష్టమయిన చాంద్రాయణాది వ్రతములు కావించి నరము లెండించుకొన్నను, ఈ నా దిక్కుమాలిన శరీర మింకను నశింపకున్నది. అయ్యో! బలవంతముగాఁ బ్రాణములు పోఁగొట్టుకొందుననుకొన్నను అట్టి వారికిఅంధకార బంధురము లయిన అసూర్యము లను నరకలోకము లవునని పెద్దలందురు. చిరకాలమునుండి యనుభవించుచున్నను దఃఖుఁగ లేక క్రొత్తదయి యెప్పటి కప్పుడే పెరిఁగి యీ దుఃఖ మణఁగ కున్నది. అమ్మా ! సీత ! నీ నిర్యాణ మిట్టిది. సిగ్గుచేఁ బైకిఁ జెప్పుకొని యేడ్చుటకును వీలు లేదు. హా ! బిడ్డా !

గీ. అంతలో నవ్వు లేమపు కలంతలోన
కలిగి పలు మొగ్గ లొక కొన్ని మొల్కలెత్త
వచ్చియును రాని పొసఁగని పలుకు లొలుకు
శైశవమునాఁటి నీ ముఖాబ్జము స్మరింతు.

భగవతీ ! వసుంధర ! నీ గుండె రాతిగుండె.

శా. నీవున్ వహ్ని మునుల్ వసిష్ఠసతియున్ దివ్యాపగా దేవియున్
దేవుం డర్యముఁడన్ప్రవాయ గురుఁడున్ దివ్యంపు మాహాత్మ్యమున్
భావంబున్ సకలం బెఱుంగుదురు గర్భం బారఁ గన్నట్టి మా
తా ! విశ్వంభర ! యెట్టు లోర్చితివి హా ! ఆ బిడ్డ వ్యాఘాతమున్.

(తెరలో) ఇటు ! ఇటు !

జ — ఓహో ! కంచుకి దారిఁ జూప నరుంధతి వచ్చుచున్నది. ఈ మహాదేవి ? (నిరూపించి) హా! కష్టము. ఈమె దశరథమహారాజు ధర్మపత్ని నా ప్రియసఖి కౌసల్య. అకటా ! ఆమెయే యీమె యని యిప్పు డెవ రనుకోఁగలరు ?

గీ. దశరథుని యింట లక్ష్మి నాఁదనరునీమె
సర్వ విధముల లక్ష్మియే సాటి యేల
కటకటా ! దైవ దుర్విపాకమ్మువలన
నామెయే దుఃఖమయ భూతమట్టు లయ్యె.

ఇది మఱియు విశేషము. మునుపు మూర్తిభవించిన మహోత్సవ మట్లు కన్పట్టు నీమె యిప్పుడు నాకుఁ బుండుపైఁ జల్లిన యుప్పుపొడివలె నసహ్యా మవుచున్నది.

తరువాత
అరుంధతి - కౌసల్య - కంచుకి - ప్రవేశింతురు.

అరుం—స్వయముగా వెళ్లి జనకునిఁ జూడు మని మీ కుల గురువులు సెలవిచ్చినను మాటి మాటికి సందేహపడెదవేమి ?

కం—ధైర్యము తెచ్చుకొని వసిష్ఠులవారు సెలవిచ్చినట్లు వర్తించుటకు విన్నవించు కొనుచున్నాను.

కౌ—ఇట్టి స్థితిలో మిథిలాధిపు నెట్లు చూతు నని నా దుఃఖార్ణవము లన్నియుఁ బొంగి పొంగి పొరలుచున్నవి.

అరుం—అవును. అట్లే. సందేహ మేమి? బంధు వియోగ దుఃఖములు సర్వదా ప్రవహిం చుచున్నను మిత్రులు కనఁబడినపుడు మఱింత కూలంకషములు గాక మానవు.

కౌ—అయ్యో! కోడలి నడవి కప్పగించి వియ్యంకునకు నా మొగ మెట్లు చూపుదు !

అరుం—యాజ్ఞవల్క్యమహాముని బ్రహ్మోపదేశముఁ జేసిన జనకమహారాజు మీకు మిగుల శ్లాఘింపఁ దగిన చుట్టము.

కౌ.—ఇదిగో! ఆ మహారాజు నకుఁ బ్రాణమిత్రుఁడును గోడలికిఁ దండ్రియు నగు రాజర్షి సీరధ్వజుఁడు. అయ్యయ్యో! ఆసర్వము స్మరణీయము. హా! మహాదేవ !

జ—భగవతీ! అరుంధతి ! సీరధ్వజుఁడు నమస్కరించుచున్నాఁడు.

శా. ఏ నీచేతను దాఁ బవిత్రుఁ డయినకోల్పొంచున్ మహోదారుఁ డా
మాసీంద్రుండు స్వతఃపవిత్రుఁడును బ్రహ్మజ్ఞుండు నీ వల్లభుం
డా నీకున్ జగదేక మంగళకు సాష్టాంగంబుగా నా శిర
స్స్నానంబున్ దిగవంచి మ్రొక్కెదను బ్రాతస్సంధ్యకున్ గైవడిన్.

అరుం—అక్షరంబయిన జ్యోతి ప్రకాశించు !

జ—ఆర్యా ! గృష్టీ ! అనామయమా యీ ప్రజాపాల మాతకు ?

కం—(తనలో) నిరవశేషముగా నిష్ఠురముగా నిందింపఁబడితిమి. (ప్రకాశము) అయ్యా! రాజర్షి ! అందువల్లనే రామభద్రు డయినను జూడక చిరకాలమునుండి దుఃఖ పడుచున్న యీామెను మరల మఱింత దుఃఖపెట్టుట తగవు కాదు. అది యేదో

రామభద్రునకును దైవ దుర్యోగము. ఏమి సేయుదు! అల్పులగు ప్రజలు అగ్ని శోధనము కూడ నమ్మక పోయిరి.

జ—(రోసముతో) ఔరా! అగ్ని యేపాటిది నా బిడ్డను శోధించుటకు? హా! కష్టము! రామభద్రుఁడు పరిభవించిన మమ్ముఁ బ్రజలుకూడ నిట్లు పరిభవించుచున్నారు.

అరుం—అవును. ఆలాగే. "అగ్ని అగ్ని" యనుటకంటె సీత యనుటే చాలు. హా! వత్సా! జానకీ!

శా. కానీ! శిష్యవొ చిన్నదానవొ యెదో కానీ! మఱేమైననుఁ
దానిన్ నే నొక లెక్క సేయను విశుద్ధంబైన నీ వర్తనం
బే నాకున్ దృఢభక్తి నీయెడను గల్పించుం గదుం బూజకుం
స్థానంబుల్ గుణముల్; మఱొండునువయస్సందర్భముం గాదుగా.

కౌ—అయ్యో! వేదనలు సహింపలేను. (మూర్ఛిల్లు.)

జ—అయ్యో! ఇదేమి?

అరుం—ఏ మున్నది?

శా. ఆ రాజేంద్రుఁడు ముద్దుబిడ్డలు సుఖాబా రోజేలా సర్వముం
ఘోరంబైన విపాకమం దిపుడు నిన్నుం జూడఁగా నేకదుం
స్ఫారంబై స్మృతివచ్చి నీ సఖి యిటుల్ వాడొంది మూర్ఛిల్లెఁ దా
నౌరా! పూవులకంటె మెత్తనకదా అబ్జాక్షికిన్ డెందముల్.

జ—అకటా! నేను మిగుల ఘాతుకుఁడను. చిరకాలమునకుఁ గనఁబడిన ప్రియమిత్రుని ధర్మపత్ని నిట్లు కనుగొనుచున్నాను. హా! మహారాజ! దశరథ! నీకంటెఁ బ్రియమేది? హా! కష్టము. ఆ కౌసల్యయే యీ కౌసల్య. పూర్వ మీ దంపతులు తమలోఁ దమ కేదేని పాటుకు పుట్టినప్పు డది నాతో వెళ్ళఁ బోసికొనుచుండువారు. అయ్యో! ఆ సర్వముఁ దలఁచుకొన్న నిలువు నీరవుచున్నది. హా! ప్రియసఖీ! (కమండులువులోని నీళ్లు చల్లు.)

కౌ—(నిట్టూర్చి) హా! వత్సా! జానకీ! ఎందున్నావు? పండువెన్నెలతోడి నిండు చెందురునట్లు కలకలలాడు పెండ్లినాఁటి నీ వదనారవిందము స్మరింతు. బిడ్డా! రమ్ము. మరల నా యొడిలోఁ గూర్చుండుము. "కులవృద్ధులకుఁ గోడలు గాని జానకి మనకుఁ గూఁతురే" యని మా మహారాజు లనుచుండువారు.

కం—అవును.

గీ. అయిదుగురు బిడ్డ లుండిన యందులోను
రాజునకుఁ గదె ప్రియుఁడు శ్రీరాముఁ డొకఁడె
అట్లె కోడండ్రు మఱి నల్వురయిన నందు
నీ మహారాజె సుత సీతయే మఱింత.

జ—హా! మహారాజా! దశరథా! ప్రియసఖా! సర్వవిధముల నిట్లు హృదయమున నాటిన నిన్ను నే నెట్లు మఱతు?

శా. జగతిం గన్నియ తల్లిదండ్రులు కదా జామాత చుట్టంబులన్
దగఁ బూజింతురు: నీకు నాకు విపరీతంబయ్యె వియ్యంబునన్
దిగమ్రింగెం జెడు పాప కాల మిది యాసీబోఁటినిం; బీజమున్
దెగె; నా కీబ్రతు కేల? ఛీ! నరకమై తీండ్రించు నిప్పట్టునన్.

కౌ—అయ్యో! జానకీ! ఏమిసేయుదు! టంక మతికిన ట్లీపాడుప్రాణములు పోకున్నవి.

అరుం—రాణీ! ఊరకుండుము. మఱచితివా యేమి? ఋశ్యశృంగాశ్రమమున మీ కులగురువు లేమి చెప్పిరి? "కాఁదగినది అట్లయినది. అయినను ముందు మేలగు" నని కదా వారు సెలవిచ్చిరి!

కౌ—అయ్యో! ఇంకను నా కెక్కడియాశ?

అరుం—అదేమి మాట? ఆ మాటయందును నమ్మకము లేదా? అట్లెన్నఁడుఁ దలంపకు.

గీ. భద్ర నిధులు సాక్షాత్పరబ్రహ్మ విదులు
బ్రాహ్మణులు వారి నుడులు దబ్బఱలు గావు
వారి వాక్కుల నిలుచు సుభద్ర లక్ష్మి
విప్లుతార్థము పలుకరు వీర లెపుడు.

(తెరలోఁ గలకలము.)

(అందఱును విందురు.)

జ—ఇది శిష్టానధ్యయనమని విచ్చలవిడి నాటలాడుకొను బ్రహ్మచారుల కలకలము.

కౌ—(చూచి) ఆహా! ఎవరి బిడ్డఁడో కాని వీరి నడుమ నున్న యా బాలుఁడు సుందర సుకుమారములయిన యంగములతో నచ్చెముగాఁ బసితనమునాఁటి రామచంద్రునకుఁ బ్రతియై నా కనుల కానందామృతము చిలుకుచున్నాఁడు.

అరుం—(తనలో సంతోషముతో) ఇదే భాగీరథి చెప్పిన రహస్య కర్ణామృతము. కాని కుశుఁడో లవుఁడో !

(ప్రకాశము)—గీ. కాకపక్షముల్ గలవాఁడు ః కలువ ఱేకు
వంటి మై చాయ గలవాఁడు ః బాలుఁ డెవఁడొ
వడుగులకు రత్నమై యున్న ః వాఁడు మరల
బాలుఁడై నట్టి శ్రీరాము ః పగిది నహహా !.

కం—ఎవరో క్షత్రియ బ్రహ్మచారి.

జ—అవును.

శా. చూడా చుంబిత కంకపత్రములతోఁ ః జోఁపట్టుఁ దూణీరముల్
తోడై భూతికి దుప్పి తో లురమునన్ ః దోఁతెంచు; మాంజిష్ఠ పుం
జోడల్ చేలము మౌర్వి మేఖల ధనుఃకాండంబుతోఁ బాణులన్
జోడన్ శ్రీ జపమాల పావనము పౌఃల్చున్ బిప్పలీ దండమున్.

భగవతీ ! అరుంధతీ ! ఎవరిపిల్లవాఁ డీ పిల్లవాఁడు ?

అరుం—మే మిప్పుడే వచ్చితిమి.

జ—ఆర్యా! గృష్టి ! నాకు మిగుల ముచ్చటవుచున్నది. నీవు వెళ్లి వాల్మీకిమహర్షి నడిగి తెలిసికొని రమ్ము. ఇంకొకటి. ఆ వృద్ధు లెవరో చూడఁగోరుచున్నారని వెళ్లునపు డా పిల్లవానితోఁ గూడఁ జెప్పుము.

కం—చిత్తము. (నిష్క్రమించు.)

కా—కాని ఆ బాలుఁడు గృష్టి చెప్పినంతమాత్రముచేత వచ్చునా ?

జ—ఎందుకు రాఁడు ? ఇట్టి నిర్మాణ మెక్కడ నయినను గుణ హీన మగునా ?

కా—(చూచి) అవురా! కంచుకి చెప్పఁగానే తనతోడిబాలురను విడిచి ఆ పిల్లవాఁ డిటు మనవంకకే వచ్చుచున్నాఁడు.

జ—(పరిశీలించి చూచి)

గీ. ఔర ! యేమొ యీతని మహిఃమాతిశయము
మోహమయమైన నా మనఃమ్మును భృశమ్ము
లాగుచున్నది మిగుల బఃలాత్కరించి
ఆయసమ్ము సూదంటుఃఱాయి కరణి.

లవుఁడు—(ప్రవేశించి) వీరందఱును బూజ్యులు. పెద్ద లెవరో తెలియక వీరిలో ముందెవరికి నమస్కరింతు? (ఆలోచించి) ఇది అవిరుద్ధ ధర్మ మని పెద్ద లందురు. (సమీపించి) అయ్యా! ఇదిగో ఇది మీ కందఱకును లవుని శిరఃప్రణామము.

అరుంధతి, జనకుఁడు—ఆయుష్మంతుఁడ వగుము!

కౌ—నాయనా! చిరంజీవివి కమ్ము.

అరుం—నాయనా! రమ్ము. (తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని తనలో) ఉత్సంగమే కాక నా మనోరథముగూడ నిపుడు పరిపూర్ణ మయినది.

కౌ—నాయనా! ఇటు రమ్ము. (తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని) ఆహా! నీలోత్పల శ్యామల మయిన యీ బాలుని దేహమే కాక కలహంస ఘోషణమువలె గణగణ లాడు కంఠస్వరముకూడ నచ్చెముగా రామభద్రునిది. కమలగర్భమువంటి శరీర స్పర్శము కూడనట్టిదే. నాయనా! (గడ్డమెత్తి మొగముఁ జూచి కన్నీటితో) రాజర్షీ! చూచితివా?

జ—చూడకేమి?

కౌ—అయ్యో! నా హృదయ మెక్కడకో చాల దూరము పోవుచున్నది.

జ— మ. ప్రతిబింబించిన మాదిరిన్ గనఁబడున్ వత్సా రఘూద్ధారకా
కృతి యీ బాలునియందు మై తళుకు దే యీ మాట లా మాటలే
వితతం బీ వినయానుభావ మదె దేవీ! తల్లి! హాహా! కడున్
మతి నేఁ డేమొకొ తప్పుత్రోవలఁ బడున్ బారిప్లవంబై యిటుల్.

కౌ—నాయనా! అమ్మ నెప్పుడయినఁ దలఁచుకొందువా?

లవు—అమ్మ లేదు.

కౌ—మఱి నీ వెవరివాఁడవు?

లవు—నేను వాల్మీకులవారివాఁడను.

కౌ—ఇంకేమైనను జెప్పుము.

లవు—ఇంతే నాకుఁ దెలిసినది.

(తెరలో)

ఓ సైనికులారా! కుమారచంద్రకేతు వాజ్ఞాపించుచున్నాఁడు. మీ రెవ్వరును మహామునుల యాశ్రమోపాంతములు త్రొక్కకుఁడు.

అరుంధతి } నేఁడు సుదినము. అశ్వముతో వచ్చిన చంద్రకేతువు కనఁబడును.
జనకుఁడు. }

కౌ—బిడ్డఁ డగు లక్ష్మణకుమారుని పుత్రుఁ 'డాజ్ఞాపించుచున్నాఁ'డని యమృత బిందువుల వంటి సుందరమైన యక్షరములు వింటి.

లవు—అయ్యా! ఈ చంద్రకేతు వెవరు ?

జ—దశరథపుత్రులను రామలక్ష్మణుల నెఱుఁగుదువా ?

లవు—వీరే కద రామాయణ కథకు మూల పురుషులు ?

జ—అవును.

లవు—ఎఱుఁగుదును.

జ—ఈ చంద్రకేతు వా లక్ష్మణుని కుమారుఁడు.

లవు—ఊర్మిళాదేవి కొడుకా ? జనకుని దౌహిత్రుఁడు.

అరుం—ఓహో! బాలుఁడు కథాప్రావీణ్యము ప్రకటించుచున్నాఁడు.

జ—(ఆలోచించి) సరేకాని నీ కీ కథ తెలిసిన పక్షమునఁ జెప్పుము. చూచెదము. దశరథపుత్రుల కే భార్యలవలన నేబిడ్డలు పుట్టిరి ?

లవు—అది నేనే కాదు. ఎవరును విని యుండలేదు.

జ—ఏమీ ? కవి రచియింపలేదా ?

లవు—రచించిరిగాని వెల్లడింపలేదు. అందులోఁ గొంత రసవంతమయిన నాటకము. స్వహస్త లిఖిత మయినదానిని వాల్మీకులవా రిప్పుడు తౌర్యత్రిక సూత్రధారుఁడగు భరతుని దగ్గఱకుఁ బంపిరి.

జ—ఎందుకొఱకు ?

లవు—అచ్చెరలచేత నాడించుటకు. మఱియు మా గురువులకు దానియందు విశేషాసక్తి. అందు చేత నే ఆ సంపుటమును శిష్యులచేత భరతాశ్రమమునకుఁ బంపుచుఁ బ్రమాదములు లేకుండ ధనుర్ధరుఁడగు మా యన్న గారిని వారికి సాయ మంపినారు.

కౌ—నాయనా! అన్న యున్నాఁడా నీకు ?

లవు—అవును. ప్రసవానుక్రమమున ఆయన పేరు కుశుఁడు.

జ—కవలా మీరు ?

లవు—అవును.

జ—పోనీ! ఆ కథా ప్రపంచ మెంతవఱకెఱుఁగుదువు'

లవు—లేని పోని పౌరాపవాదమువలనఁ ద్వరపడి రాజు సెలవిచ్చిన ప్రకారము లక్ష్మణుఁడు నొప్పులుపడు సీతాదేవి నరణ్యమున విడిచి వెళ్లువటను.

కౌ—హా! బిడ్డా! ముగ్ధముఖీ! కుసుమ సుకుమార మగు నీ శరీరమునకా యీ దైవ దుర్విలాసము!

జ—హా! పుత్రీ!

గీ. పరిభవము నెంచి ప్రసవంపు బాధ మించి
కాఱడవిఁ గాంచి దుష్ట మృగాలఁ జూచి
మాటిమాటికి శరణంచు మది మఱెంత
తలచుకొంటివొ కద నీవు తనయ నన్ను!

లవు—వీ రెవరు?

అరుం—ఈమె కౌసల్య. ఈయన జనకుఁడు.

లవు—(సబహుమాన ఖేద కౌతుకముగాఁ జూచు.)

జ—ఆహా పౌరు లెంత నిర్దయులు! ఓహో యేమి రాముని వ్యగ్రత!

శా. చాపంబో మఱి శాపమో ఒకఁడెవో సన్నద్ధముం జేయుచోఁ
దాపంబుఁ గొను నాకుఁ గాల మిది క్రోధంబుఁ రగుల్గొల్పఁగా

కౌ—(భయముతో) భగవతీ! రక్షింపుము! రక్షింపుము!

లవు—అవును. అవమానము వచ్చినప్పు డిదే ప్రతిక్రియ.

అరుం—రాజా! రాముఁడు నీ బిడ్డ. పౌరులా? కృపణులు. రక్షణీయులు.

జ—శా. పాపం బా రఘు నందనుండు తనుభూభాండంబు నా వారలే
రాపాడన్ ద్విజ బాల వృద్ధ వికల ప్రాయుల్ ప్రజల్ పౌరులున్.

వటువులు—(అడావడితోఁ బరుగెత్తుకొని వచ్చి) కుమారా! కుమార! "అశ్వమశ్వ" మని వించున్నది యిపుడు ప్రత్యక్షముగాఁ జూచినాము. నాలుగు కాళ్లు, నాలుగు డెక్కలు, వలమైన తోఁక, రా రమ్ము. పరుగెత్తుచున్నది. (అజినము, హస్తములు, విల్లు పట్టుకొని లాగుదురు.)

లవు(కౌతుకము నాఁపుకొనుచు వినయముతో) అయ్యా! చూడుఁడు. నన్నుఁ పట్టుకొని పోవుచున్నారు. (పరుగెత్తు.)

కౌ—భగవతీ! అరుంధతి! నాకేమియుఁ దోఁపకున్నది. మనమును వెంబడించి చూతము రండు.

అరుం—ఏఁడీ? అప్పుడే చాలదూరము పరుగెత్తినాఁడు.

కం—(వచ్చి) "ఇప్పుడు కాదు. సమయము వచ్చినప్పుడది మీకుఁ దెలియు" నని వాల్మీకులవారు సెలవిచ్చిరి.

జ—ఏదో యిది మిగుల గంభీరముగానున్నది. భగవతీ! అరుంధతి! సఖీ! కౌసల్యా! స్వయముగా వెళ్లి మనమే ప్రాచేతసునిఁ జూతము రండు.

(నిష్క్రమింతురు.)

వటువులు—(ప్రవేశించి) కుమారా! చూడుచూడు. అదిగో!

లవు—అవును జూచితిని. అది అశ్వమేధాశ్వము.

వటు—ఎట్లు గ్రహించితివి?

లవు—మూర్ఖులు. ఆకాండము మీరును జదివితిరి. అదిగోఁ జూడుఁడు! తదనుగుణమగు బలము. ఇంకను సంశయమున్న నడుగుఁడు.

వటు—ఎందు కీ గుఱ్ఱము నిట్లు త్రిప్పెదరు?

లవు—(కోరికతోఁ దనలో) అశ్వమేధ మనఁగా విశ్వవిజయము లొనర్చు సర్వక్షత్ర పరిభావి యగు మహాక్రతువు.

(తెరలో)

గీ. సప్తలోకైక వీరుఁడై సంగరమున
రావణాదుల నెల్ల దూరాక్షసులను
సంహరించిన రాఘవు జయ పతాక
వీర ఘోషణ మఱియు నీ వారువంబు.

లవు—(గర్వముతో) అవురా కోప సంధుక్షణము లక్షరములు!

వటు—అవును అది మేమెఱుఁగుదుము. తమవారినిఁ దమరందఱు నట్లే పొగడుకొందురు.

లవు—ఓహోహో! ఏమి మీ చాటింపు! పుడమిపై నొరు లెవరును క్షత్రియులే లేరా?

(తెరలో) అరేరేరే! మా మహారాజుముందఱ క్షత్రియు లెక్కడ?

లవు—ఛీ! మూర్ఖులు.

శా. లేరా క్షత్రియు లెవ్వరున్ బుడమిపై । లేకేమి యున్నారు ఛీ!
బీరముల్ విని మీ బిభీషికలకున్ । భీతిల్లు వారెవ్వరున్
లేరిచ్చోటను మాటలేల? వెడఁగుల్ । మీ రాజునున్ మీరునున్
శూరుల్ కంటు! హరింతు మీదగు యశ । శ్శోభాపతాకాశ్వమున్.

వటులారా! దీనిని మీరు మంటి బెడ్డలతో మల్లించి లోహితముల లోనికిఁ దోలుఁడు.

పురుషుఁడు—(కోపముతోఁ బ్రవేశించి) ఓరీ! చపల! ఏమంటివి? బాలుఁడవని మా కఱుఁగత్తులు కనికరింపవు. రాజపుత్రుఁడు చంద్రకేతువు మిక్కిలి దుర్దాంతుఁడు. అపూర్వారణ్యములను జూచుచు నతఁ డింకను రాలేదు. ఇదే సమయము. ఈ చెట్ల చాటునుండి కనఁబడక రహస్యముగాఁ బాఱిపొండు.

వటు—కుమారా! గుఱ్ఱముతో నేమిపని? అదిగో! ధనువులు మ్రోయుచున్నవి. ఆశ్రమము దూరము. రా రమ్ము. లేడి పరుగునఁ బరుగెత్తుదము.

లవు—(నవ్వి) మ్రోయుచున్నవేమి? (విల్లెక్కువెట్టుచు)

సుగంధి. గీ. చాఁపు నాల్క రీతి నారి । సాఁగి క్రేళ్లు దాఁటఁగాఁ
గోపు వాఱు కోఱ పోల్కిఁ । గోటి సంచు మించఁగాఁ
గోపగించినట్టి కాలు । ఘోర వక్త్ర యంత్రమై
చాప మాడుఁగాక నాది । శత్రు చర్వణంబునన్.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ బ్రహ్మానంద విరచితము. ఉత్తర రామ చరితము.

చతుర్థాంకము.

శ్రీరస్తు.

బ్రహ్మానందీయము.

# ఉత్తరరామచరితము

## పఞ్చమాఙ్కము.

(తెర లో)

ఓహో సైనికులారా! పాఱిపోకుఁడు. పాఱిపోకుఁడు.

గీ. వారువములు సుమంత్రుని - ప్రేరణమున
రయమ్ముఁ జూపఁగఁ గోవిదార - ధ్వజంబు
విషమ భూముల నసియాడ - వేగ మిదిగో
చంద్రకేతువు వచ్చెను - సమరమునకు.

(చంద్రకేతువు ప్రవేశించు.)

చం— ఆర్యా! సుమంత్ర! చూడు చూడు.

గీ. ఆననమునఁ గించిత్కోప - మంకురింపఁ
జిందులాడంగ సిగ; వింటి - శింజ మ్రోయ
బాపురే! వీర పోత మెవ్వాఁడొ యితఁడు
రణశిరమ్మున శర తుషా - రమ్ముఁ గురియు.

ఆహా! మ. ఒకఁడయ్యున్ మునిబాలుఁ డీతఁడు ప్రకో - పోద్దీపితుండై రఘు
ప్రకటోదార కులాపకీర్తి లతికన్ - బ్రత్యగ్ర బీజంబు నా
* సకలంబున్ వికలంబుఁ జేయుచుఁ జమూ - సంరంభమున్ దంతి
రాట్ప్రకరంబున్ వికరంబుగా నఱకుచున్ - రంజించు నాడెందమున్

* మ. మునిబాలుం డొకఁడయ్యు మా రఘు కులం - బున్ దుర్యశో రాశిలో
మునుపన్ బుట్టిన వీరపోత మనఁగాఁ - బుంఖాను పుంఖంబులై
కనలన్ జిమ్ముచు నమ్ములన్ గరి ఘటా - గండంబులన్ డొల్చుచున్
మనమందున్ గలిగించు నాకు మిగులన్ - సంతోష మెంతేనియున్.

సు—కుమారా!

గీ. సుప్రభావమ్ముచే సురాసురుల మించి
రూపమున నల్లి యున్న యీ పావనిఁ గని
గాధిపుత్రుని జన్నముఁ గాచునాఁడు.
ధనువు దాల్చిన మీ పెదతండ్రిఁ దలఁతు.

చం—సిగ్గుసిగ్గు. ఒకనిపై నెందఱు విజృంభించిరి!

సు—ఇందఱే కాదు. ఇఁక నెందఱయినను వీనికిఁ జాలరు.

చం—ఆర్యా! త్వరపడుము. త్వరపడుము. అదిగో!

మ. విలు మ్రోఁగించుచు యుద్ధదుందుభులతో సేనల్ కడున్ బ్రద్దలై
కలగుండుగన్ గొని కొండ యేనుఁగులు వీఁకన్ దక్కి గీపెట్టఁగన్
దలపుఱ్ఱల్ పడవేయుచుక్ వసుమతిన్ గావించుచున్నాఁడదే
బలవన్మృత్యుకరాళ వక్త్ర విఘున ప్రాయంబుగా వీరుఁడై.

సు—(తనలో) ఇట్టి వీరునితోఁ జంద్రకేతువునకు ద్వంద్వయుద్ధము నెట్లంగీకరింతు!
(ఆలోచించి) కాకేమి? సంగరము సముపస్థితమయినది.

చం—ఛీ, సైన్యములు చెదరి పరుగు ప్రారంభించినవి.

సు—(రథవేగము నిరూపించి) కుమారా! ఇదిగో! ఈ వీరుఁ డిప్పుడు నీకు మాట 'కందు
చున్నాఁడు.

చం—ఆర్యా! ఆహ్వయము లేమని పిల్చుచున్నారు.

సు—లవుఁడని.

చం—ఓ మహాబాహూ! లవ! వారితో నేమిపని? ఇదిగో! ఇటు రమ్ము.

సు—కుమారా! చూడు చూడు.

గీ. కరులఁ జెండాడుచున్న సింగంపుఁ గొదమ
వారిద ధ్వని విని మళ్లి వచ్చినట్లు
పిలుపు విని నీది సేనల విడిచి వేగ
వచ్చుచున్నాఁడు మన పైకి బాలుఁ డితఁడు.

(లవుఁడు ప్రవేశించు.)

లవు—(గర్వముతో) ఆ ! అవును. ఐక్ష్వాకుఁడవు. ఇదిగో నేను వచ్చితిని.

(తెరలోఁ గలకలము.)

లవు—(తిరిగి చూచి) ఛీ ! ఛీ ! మూర్ఖులు. ఇప్పుడే పరాజితులై పాఱిపోయియు మరల సిగ్గులేక వెనుకనుండి వచ్చి గందరగోళించెదరు. ఇదెంత సేపు ?

శా. ఛీ ! సేనాపతులార ! నిల్వుఁ డెదురై శ్రీఘ్రంబ సర్వంబునున్
మీ సంరంభము లింకుఁగాక ప్రళయా నేహంబులై మండు నా
రోసంపుం బడబాగ్ని దీధితులకున్ బ్రోచ్చండ చక్రానిల
ప్రాసంగ క్షుభితాపగా రమణ పూరంబుల్ బలెన్ లక్ష్యమై.

(వేగముగాఁ బరిక్రమించు.)

చం—కుమారా ! కుమార !

గీ. కూర్మి చెలికాఁడ వయితివి గుణమువలనఁ
గనుక నా సర్వమును నీది గాక యున్నె ?
స్వపరివారముతో నీకు సమర మేల ?
చంద్రకేతువు నీ నికషం బితండు.

లవు—(సంభ్రమముతో మళ్లి) ఓహో ! యేమి యీ సూర్యకుల కుమారుని ప్రసన్న కర్కశము లయిన వీర వచనములు ! వీరితో నేమిపని ? వీనినే పురస్కరింతు.

(రెండియుఁ దెరలోఁ గలకలము.)

లవు—(క్రోధముతో) ఆ ! ఈ పాపాత్ములు వీరగోష్ఠికి విఘ్నకారు లవుచున్నారు. (ఎదురు తిరుగు.)

చం—ఆర్యా ! చూడు చూడు.

గీ. ముందు నా మీఁద లక్ష్యము మోపి వెనుకఁ
బృతనలకు విల్లు మోపెట్టు సీతఁ డొప్పు
నిరు కెలంకుల గాడుపు లురవడింప
శక్ర చాపముఁ దాల్చిన జలద మట్లు.

సు—కుమారా ! మనమే విస్మయ వివశుల మవుచున్నాము. ఇఁక వీరెంత ?

చం—ఓహో ! రాజులార !

మ. అరదమ్ముల్ ద్విరదమ్ము లెక్కి జవనాశ్వారూఢులై యెల్లరున్
జరణాశ్వాన్ గవచాపిధాను లవుచున్ జర్మోత్తరీయున్ దలల్
నర లేపారిన మీరు బాలు నొకనిన్ లక్షించి కయ్యమ్మునన్
బురికో సిగ్గెటులేదు చాలు నిఁక మీమూలాంబునన్ మానునున్

లవు—పాపము! నా కోసము జాలిపడుచున్నాఁడు. (ఆలోచించి) ఎంతసేపీకాలహరణము? జృంభకాస్త్రముఁ బ్రయోగించి వీరి నెల్ల బ్రమానుపఱుతు. (ధ్యాన మభినయించు.)

సు—ఇదేమి యింతలోనే సైన్యము సద్దణఁగినది?

లవు—ఇఁకఁ బ్రగల్భునిఁ జూచెదను.

సు—కుమారా! కుమారుఁడు జృంభకాస్త్రమునా మంత్రించియుండు.

చం—సందేహమేమి?

మ. మెఱపుల్ చీఁకటు లేకమైనటులు సమ్మేళంబెదో కన్నులన్
మిఱుమిట్లార్చి కలంచు యత్నపడినన్ వీక్షింప నెంతేనియున్
మఱి చిత్రించిన బొమ్మలై నిలఁబడెన్ మాటాడకే వాహినుల్
స్ఫురదస్త్రంబిదిజృంభకాస్త్రమెమహాస్ఫూర్తిన్ విజృంభించెడిన్.

ఆహా! ఏమి యీ వింత!

మ. బలిగేహంబున డాఁగి యుండిన తమోవారంబటుల్ నీలమై
కొలిమిన్ గాల్చిన యారకూటపుఘృణుల్ గుప్పించుచున్ వ్యోమమున్
గలయన్ గప్పెను జృంభకంబు లురుమేఘశ్రీ తటిద్గర్భముల్
ప్రళయంబందలి వింధ్య శృంగములు నావాత్యా సముద్ధూతముల్.

సు—అవునవును. ఎక్కడివో వీని కీ జృంభకాస్త్రములు?

చం—వాల్మీకి మహామునివలననే వచ్చియుండు.

సు—అట్లనుకొనుటకు వీలు లేదు. కృశాశ్వునివలన విశ్వామిత్రుఁడును, విశ్వామిత్రుని వలన రామభద్రుఁడును బొందిరి. ఇది సంప్రదాయ క్రమము.

చం—అయినను విశేష జ్ఞానులు కొందఱు స్వయంవేత్తలు నందురు.

సు—వత్సా! సావధానుఁడవు కమ్ము. నీ ప్రతివీరుఁడు మల్లి వచ్చినాఁడు.

కుమారులు—(ఒకరి నొకరుఁ జూచి స్నేహానురాగములతోఁ దమలో)

గీ. ప్రాగ్భవంబున నెలకొన్న పరిచయంబొ
చూపునకు రాక డాఁగిన చుట్టరికమొ
యేదొ యీతనిఁ గనినంతనే భృశమ్ము
కలుగుచున్నది అటువంటి కలన మదికి.

సు—ఇది జీవుల స్వభావము. ఒకానొకచోట నొకానొకనికిఁ జక్షూరాగము కలిగించే నకృత్రిమప్రీతి. ఆ స్నేహ సూత్రమే అంతరంగములు కలియఁ గలుపు.

కుమారులు—(తమలో)

గీ. కనినమాత్రనే దేహము గగురు పొడిచి
కౌగిలించుకో నభిలాష కలుగు మదికి
నీల వర్ణము గల పట్టునూలువంటి
యితని దేహముపై నమ్ము లెట్లు విడుతు?

మ. ఇరవేమున్నది వేఱు శస్త్రము వినా యీలాటి విల్కానిపై
గుఱి గాకున్నది శస్త్రమెందుకు? ధనుర్గోష్ఠీ ప్రసంగంబురాఁ
జొరకే మ్లిన వీరుఁ డీతఁ డెటులంచున్ నన్నులో నెంచునో
కరమున్ వీర రసమ్ము దారుణ మహో! కన్మాయ స్నేహంబునన్.

సు—(లవునిఁజూచి కన్నీటితో) హృదయమా! ఎందుకు నీ కీ యాందోళము? మొదలూడిన పిమ్మట మొగ్గ యెట్లు?

చం—ఆర్యా! సుమంత్రా! రథము దిగుచున్నాను.

సు—ఎందువల్ల?

చం—పాదచారులతో రథికులకు రణము ధర్మము కాదు.

సు—(తనలో) కష్టము. ఏమి సేయుదు? వలదన్న ధర్మవిరుద్ధము. సమ్మతించిన సాహసము.

చం—మా తండ్రులుకూడ సంశయము వచ్చినప్పుడు నిన్నడిగి తెలిసికొనుచుందురు.

సు—వత్సా! అవును. ఇదే సాంగ్రామిక న్యాయము. ఇదే సనాతన ధర్మము. ఇదే మీ రఘువీరుల వీర చారిత్ర పద్ధతి.

లవు—ఆహా యేమి యీ రస సంకరము!

గీ. చందమామను గను కల్వ చంద మగుచు
నితనిఁ గని సంతసించు నా దృష్టి మఱియు
బాహు దండము వింటిని దోహలించి
సంగరమునకు మిగుల నుత్సాహపడును.

చం—(రథము దిగి) ఆర్యా! సావిత్రుఁడు చంద్రకేతువు నమస్కరించుచున్నాఁడు.

సు—ఆదివరాహము అహిత మడఁచుఁగాక! మఱియు.

మ. తగ సౌపర్ణము నాగ్నిమారుతము నైంద్రావైష్ణవా బూర్జితం
బగుఁగాకోజము! రాములక్ష్మణధను ర్జ్యాఘోషమంత్రంబులున్
నెగడుంగాక జయప్రదంబు లవుచున్! నీ యీ రణం బెంతయున్
గగనజ్యోతికి మీ వసిష్ఠ మునికిన్ సంతోష మౌఁ గావుతన్.

లవు—కుమారా! కుమార! వద్దువద్దు. రథము దిగవద్దు. అదే నీకు మిగుల శోభ.

చం—అట్లయిన మఱి నీవుకూడ రథమెక్కుము.

లవు—ఆర్యా! రాజపుత్రుని మరల రథ మెక్కింపుము

సు—నీవుకూడ నతఁడు చెప్పినట్లు చేయుము.

లవు—ఎందుకు మీ కీ విచారము? ఎవరి యుపకరణములు వారికున్నవి. ఆరణ్యకులము రథచర్య లెట్లు?

సు—వత్సా! చూచితివా దర్ప సౌజన్యములు? రామభద్రుఁడే చూచెనేని మన సెంత ద్రవించునో.

లవు—ఓయీ! చంద్రకేతూ! ఆ రాజర్షిని మేము (స్వజనుఁడు) సుజనుఁడని వినుచున్నాము. అయినను నా మాటవలనఁ దురగ రక్షకులకుఁ గోపము వచ్చినది.

చం—(చిఱునవ్వుతో) ఓయీ! నీకుఁ దాతగారి ప్రతాపమందుఁగూడఁ గోపమేనా?

లవు—ఓహో! క్షత్రధర్మ మొక మీ తాతగారిదేనా యేమి?

సు—కుమారా! సత్యము. సైనికుల నోడించితివి. అయినను బరశురాము నోడించిన ప్రభువుపట్లఁ బరుషములు పలుకుటకు నీవు తగవు.

లవు—ఆర్యా! పరశురాముని గెల్చుటలోఁ గల విశేష మేమి

గీ. పాఱులకు నెల్ల నుడులనే పౌరుషంబు
క్షత్రియుల కెల్ల నది భుజార్గళములందు

పరశురాముఁడు దాంతుఁడు బ్రాహ్మణుండు
కాపురే! చాలు మీ రాజు పౌరుషంబు.

చం—ఆర్యా! చాలుఁ జాలు. పాప మీ బాలుఁడు పరశురాముని పరాక్రమము తాత గారి చరితలు కూడ నెఱుఁగఁడు.

లవు—ఓహోహో! ఏమి మీ పొగడికలు!

గీ. సుందుని కళత్రమును జంపి శూరు లయిరి
వెనుక డాఁగి వాలినిఁ గొట్టి వీరు లయిరి
ఖరునిఁ జంపిరి వెనుకకుఁ బరుగు లిడుచు
ధరణి నెఱుఁగఁడు మీ తాత చరిత లెవఁడు?.

చం—ఆ! తాతాపవాదీ! మర్యాద తెలియక గర్వించుచున్నావు.

లవు—ఆ! ఏమి? నామీఁద నే ఆ భ్రుకుటి?

సు—ఇరువురకును వీరికిఁ గోపము రగిలినది.

మ. కలిగెన్ గోపము చిందులాడు నలకల్ కంపించె సర్వాంగముల్
చిలికెన్ గన్నులు సిందురంపు జిగులన్ జెంగల్వ పూఁతేకులై
అళి దీపించెడు పద్మమై విపుల చిహ్నాంబిందు బింబమ్మునై
బలిసెన్ భీకరమై కరాళమయి భ్రూభంగంబుచే వక్త్రమున్.

కుమారులు—రా. రమ్ము. విమర్దన క్షమ మగు భూమికిఁ బోవుదము.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ బ్రహ్మానంద విరచితము. ఉత్తర రామ చరితము.

పఞ్చమాఙ్కము.

శ్రీరస్తు.

బ్రహ్మానందీయము.

# ఉత్తరరామచరితము

## షష్ఠాఙ్కము.

(తరువాత విమానమెక్కి విద్యాధర మిథునము ప్రవేశించు.)

విద్యాధరుఁడు—అహో! ఆశ్చర్యము. ఒకరి నొక రెఱుఁగక పోరాడు నీ వికర్తన కుల కుమారుల విక్రాంత విలసితములు సురాసురులనుగూడఁ బైఁ దాఁటుచున్నవి. సుందరీ! చూడుము.

గీ. కింకిణులు మ్రోయఁగా నారి టంకరించి
శూరులై భృశమ్మును స్ఫురచ్చాపు లగుచు
గరము సంగ్రామ మిది భయంకరము గాఁగఁ
గురియుచున్నారు శర పరంపరలు వీరు.

విద్యాధరి—నాథా! ఇదేమి యేమూలఁ జూచినను మెఱుపులతో నిండి గగన మంతయు నింతలోనే వేఱొక భంగిఁ దాల్చినది?

వి-డు—ఓహో! ఇదేమి? ఇది విశ్వకర్మ సానపై నొరయు సూర్య మండలమా? ఫాలలోచనుఁడు తెఱచిన తృతీయ లోచనమా? కాదు కాదు. చంద్రకేతువు ప్రయోగించిన యాగ్నేయాస్త్రము.

గీ. క్షణము కుంకుమ పూసిన చేంద మగుచు
ధ్వజ పటమ్ములఁ గాల్చె నీ జ్వలన శిఖలు
చామరంబులు జెండాలు క్షణములోన
మండి మల్లినవి విమాన మండలములు.

ఓహోహో! ఆశ్చర్యము. వజ్రఖండములవంటి స్ఫులింగము లుమియుచు భయంకర మయిన యీ దహన శర సంపాతము భగ్గుభగ్గున మండి ప్రజ్వలించుచున్నది. కా

వున నా ప్రియురాలిని దేహముతోఁ గప్పుకొని దూరముగాఁ గొనిపోయెదను.

(అట్లు కావించు.)

వి-రి—ఆహా! ఆణిముత్యాల హారమువలెఁ జల్లనయిన నా నాధుని శరీర స్పర్శముచే నా సంతాపము సర్వము సగము పుట్టువులో నంతలోనే యంతరించినది.

వి-డు—సుందరీ! ఆ సర్వము నాపైఁ గల నీ యనురాగము.

వి-రి—నాథా! నాథ! అదేమివింత, ఉఱుములతోడను మెఱుములతోడను బడబడ లాడుచు నెమిలి కంఠమువలె నల్లనయిన కాఱుమేఘము లపూర్వములై యాకాశ మును సర్వమును దిగమ్రింగుచున్నవి?

వి-డు—అది లవుఁడు ప్రయోగించిన వారుణాస్త్రము. పావకాస్త్రము చల్లారినది.

వి-రి—సంతోషము.

వి-డు—ఔరా! మితి మీఱిన సర్వము దోషమునకే యగును. ప్రలయానిల క్షోభమున గుళగుళాయమానములయిన జీమూతములు మూఁగి నట్లంధకారబంధురమై భూత జాతము సర్వ మిప్పుడు భయపడుచున్నది. (ఆనందముతో) మేలు! చంద్రకేతూ మేలు! వాయవ్యాస్త్రము మంచి సమయమునఁ బ్రయోగించితివి. మేఘము లెక్కడి వక్కడనే యెగిరిపోయినవి.

వి-రి—నాథా! వారెవరు. పై మీఁది బట్టకొంగును విసరి దూరమునుండియే వలదు వల దని కలహమును వారించుచుఁ గుమారులకు నడుమ విమానమును దింపుచున్నారు?

వి-డు—ఆయన శంబూక వధనుండి మళ్లి వచ్చిన రఘుపతి.

గీ. ఆ మహానుభావుని పల్కుకే లాలకించి
సంప్రహారము లవుఁ డుపకే సంహరించెఁ
జంద్రకేతువు ప్రణమిల్లెకే స్వస్తి యగును
గాక! సుత సంగమమున భూకే కాంతునకును.

(నిష్క్రమింతురు.)

తరువాత

రాముఁడు-లవుఁడు-ప్రణమిల్లిన చంద్రకేతువు ప్రవేశింతురు.

రా—(పుష్పకమును దిగుచు)

క. రావొూయి చంద్రకేతూ!

రా పుత్రా యీ నాదు తండ్రి ! రవి కుల చంద్రా !
రా వచ్చి కౌఁగిలింపుము
వేవే నా చిత్త దాహవృద్ధియు నణఁగన్.

(ఆనంద బాష్పములతో లేఁదీసి కవుఁగిలించుకొని) కుమారా ! కుశలమా నీకు దివ్యాస్త్ర ధరునకు?

చం—తాతా ! అత్యద్భుత క్రియలు గల యీ ప్రియ మిత్రుఁడు లవుఁడు లభించినందు వలన విశేషించి కుశలము. నన్నుఁ జూచునట్లు కాని అంతకంటె విశేషించికాని తాతగారు చెల్లని స్నేహ దృష్టితో నీ వీరునిఁ జూడవలయు.

రా—(లవునిఁ జూచి) ఆహా ! యేమి యీ యాకృతి విశేషము !

గీ. భువనముల నెల్లఁ బ్రోవంగ మూర్తిమంత
మయిన క్షాత్ర ధర్మమొ ధనురాగమంబొ
నిండు గొనముల నిధియొ పుణ్యముల ఖనియొ
కాని సామాన్య బాలుఁడా కాఁడితండు.

లవు—(తనలో) గీ. ఔర ! యిది యేమి చిత్రమో అద్భుతంబు
ఈ మహామహుఁ గన్నంతనే భృశమ్ము
మాయమై పోయెఁ బగ యెల్ల మఱియు వినయ
మావరించెను వివశుండ నయితి నిపుడు.

రా—ఏమోకాని యీ బాలునిఁ జూడఁగానే నా యంతరాత్మ కనిర్వాచ్య మయిన యానంద మవుచున్నది.

మ. ఒకఁ డంతర్గతమాచుఁ గారణ మెదో ఉండుఁగా గదుఁగా ప్రీతికిన్
బ్రకటంబుల్ మఱి కావు ప్రీతికి బహిర్వ్యాపారముల్ మూలముల్
వికసించుఁగా గద పుండరీకము మరుద్వీధీమణిన్ జూచినన్
సకలంబుఁగా ద్రవియించుఁ జంద్ర శిలయుఁగా జంద్రోదయంబందునన్.

లవు—చంద్రకేతూ ! ఎవరు వీరు ?

చం—ప్రియ వయస్యా ! వీరు తాతపాదులు.

లవు—ధర్మమువలన నాకును అట్లే. అట్టివారు రామాయణ కథా పురుషులు నలుగురు వారిలో విశేషము ?

చం—జ్యేష్ఠులు.

లవు—(ఉల్లాసముతో) ఓహో! దేవుఁడు రఘునాథుఁడా? ఆనందము. పుణ్య వశమున నేఁడీమహానుభావుని దర్శనము. (వినయముతో నుత్సాహపడుచేఁ జూచి) తాతా వాల్మీకిమహాముని శిష్యుఁడు లవుఁడు నమస్కరించుచున్నాఁడు.

రా—నాయనా! రమ్ము. (కౌఁగిలించుకొని)

గీ. చంద్ర కాంతుల చెందమై చందనంపు
జలకమై చాల సరళమై చెల్లనయిన
నీ పరిష్వంగ మిది వత్స! నిశ్చయముగ
ముంచుచున్నది యానంద పూరమందు.

లవు—(తనలో) పాపము! వీరికి నాపై నిర్హేతుకముగా నింత స్నేహము. అజ్ఞాన వశమునఁ నేనే వీరి కపకారము సేయ వృథాగా సిద్ధపడితి (ప్రకాశము) తాతా! లవుఁడు చేసిన తప్పు క్షమింపుఁడు!

రా—వత్సా! నీ చేసిన తప్పేమి?

చం—అశ్వాను యాత్రికులవలనఁ దాతగారి ప్రతాపము విని సహింపక మిత్రుఁడు పరాక్రమించినాఁడు.

రా—అది క్షత్రియుల కలంకారమే.

గీ. సైఁపఁ డెన్నఁడు తేజస్వి జగమునందుఁ
బరుల తేజము; వాని స్వభావ గుణము
ఉష్ణ భానుఁడు మెఱయ భానూపలంబు
నిప్పులను గ్రక్కుఁగాదె తీక్ష్ణించి మిగుల.

చం—తాతా! తేజమే కాదు. ఈ మహావీరుని కోపముకూడ నటువంటిదే. అదిగో చెలికాఁడు ప్రయోగించిన జృంభకాస్త్రమువలన భ్రమనుపడి మనసేన లట్లయినవి.

రా—నాయనా! లవ! అస్త్రి ముపసంహరింపుము.

లవు—(ధ్యాన మభినయించు.)

రా—కుమారా! నీవు వెళ్లి మన బలముల నూఱడింపుము.

చం—చిత్తము. (నిష్క్రమించు.)

లవు—తాతా! అస్త్రిము శాంతించినది.

రా—వత్సా! జృంభకాస్త్రముల ప్రయోగ సంహారములు బహు రహస్యము. ఎందుండి నీకా సంప్రదాయము?

లవు—ఒకరు చెప్పినవి కావు. అవి మాకు స్వయముగానే వచ్చినవి.

రా—(తనలో) ఇది యేదో మహా పుణ్య మహిమ. (ప్రకాశము) బహు వచన మేట్లు?

లవు—మేము కవలము.

రా—మఱి రెండవ యతఁ డేడీ?

(తెరలో)
{ దాండాయనా! దాండాయన! ఏమంటివి? }

గీ. అశ్వమేధార్థ రాజ సైన్యములతోడఁ
బవరమా చిరంజీవికి లవున కిపుడు?
మంచి దధిరాజ పద మంత రించుఁగాక!
వారి శస్త్రానలములు చేల్లారి యింకను.

రా—ఓయీ! ఇతఁ డెవరు? కాలాంబుద గర్జితము విని కడిమి చెట్టు మొగ్గ తొడిగినట్లు ఇంద్ర నీల కాంతి గల యీతని కంఠధ్వని విని నా మేను బులకించెడిని.

లవు—ఇతఁడు భరతాశ్రమమునుండి మరలి వచ్చిన నాయగ్రజుఁడు కుశుఁడు.

రా—వత్సా! యిక్కడకుఁ బిల్చుకొని రమ్ము.

లవు—అలాగే. (పరిక్రమించు.)

కుశుఁడు—(ప్రవేశించి క్రోధముతో విల్లు మ్రోయించి)

గీ. అభయ దక్షిణ లొసఁగి వజ్రాయుధునకుఁ
బగలకును బ్రతాపాగ్నులై ప్రభ వహించు
భాను కుల దీపకులతోడఁ బ్రబధన మయిన
ధన్య మిది కాదె నా చేతి ధనువు మిగుల?

(వికటముగాఁ బరిక్రమించు.)

రా—ఆహా! ఏమి యీ క్షత్రియ పోతము పౌరుషాతిరేకము! దృష్టిచే ముల్లోకము లను దృణీకరించుచుఁ గౌమారమునఁగూడ గిరివలె గురుత్వము నే ధరించు చున్నాఁడు.

లవు—(సమీపించి) ఆర్యా! జయము.

కు—తమ్ముఁడా! యిదేమి "యుద్ధము యుద్ధ" మని వినఁబడుచున్నది?

లవు—ఎంత యుద్ధము. ఏదో కొంచెము. కాని దర్పము విడిచి వినయముతోఁ బ్రవర్తింపవలెను.

కు—ఎందువల్ల?

లవు—ఆయన ఆ రామాయణ కథానాయకుఁడయిన బ్రహ్మాండము నేలు దేవుఁడు రఘునందనుఁడు.

కు—ఓహో! ఆ మహాత్ముఁడు ప్రశంసింపఁదగిన పుణ్యాత్ముఁడు. ఎట్లు పొందవలసి యుండునో?

లవు—గురువులను బొందినట్లు.

కు—ఎందువల్ల?

లవు—ఊర్మిళాదేవి కొడుకు చంద్రకేతువు మిగుల యోగ్యుఁడు. అతఁడు "ప్రియవయస్యా! ప్రియవయస్యా" యని నాతో స్నేహము గలుపుచు మాట్లాడినాఁడు. అందువల్ల మనకుఁగూడ నీ రాజర్షి తాతగారు.

కు—సరే. అట్లయిన మనకు రాజయినను వినయము తప్పు కాదు.

(ఇరువురును బరిక్రమింతురు.)

లవు—అన్నా! ఆ మహాభాగునిఁ జూడుము. లోకోత్తరమయిన సుచరితాతిశయముఁ బ్రకటించు రూపానుభావ గాంభీర్యము లెట్లొప్పెడినో?

కు—(చూచి) ఆహా! యీ మహాపురుషుని రూపము కేవలము ప్రసాద మయము. అనుభావము పావనము. బాగున్నది. రామాయణ కవి వాగ్దేవికిఁ బ్రతిష్ఠ తెచ్చెను. (సమీపించి) తాతా! వాల్మీకులవారి శిష్యుఁడు కుశుఁడు నమస్కరించుచున్నాఁడు.

రా—వత్సా! రమ్ము. (కౌఁగిలించుకొను.)

లవు—తాతా! ఎండ తీవ్రముగా నున్నది. ఈ మద్దిచెట్టు నీడకు రండు.

రా—వత్సా! నీ యిష్టము.

(అందఱును బరిక్రమించి తగునట్లు కూర్చుందురు.)

రా—(తనలో) ఆహా! వినయముగల వీరి పోలికలు సామ్రాజ్య సూచకములు. మఱియు వీరియందు మా రఘువంశపుఁ బోలికలుకూడఁ గనుపట్టు.

గీ. మేను పారావత గ్రీవకై మేచకమ్ము
స్కంధములు వృష స్కంధ సంబంధు లగును
చూపు స్తిమితము మృగరాజుచూపు పగిది
మఱియు ధ్వని మంగళ మృదంగమాంసలంబు.

(పరిశోధించి చూచి) ఆహా! జానకి పోలికలుగూడ నున్నవి.

మ. సుమనోజ్ఞంబగు కర్ణ పాశ మదియే శుక్లాచ్ఛ దంత ప్రభా
రమణీయంబగు నోష్ఠ ముద్రయు నదే రక్తంబులై యున్న నీ
లములౌ కన్నుల భాగ్య రేఖ లవియే లక్ష్మీ చతుశ్శాల మ
చ్చెముగా జానకి మోమె చూచినటులౌ సర్వంబు నిప్పట్టునన్.

(ఆలోచించి) అదే యిది వాల్మీకిమహాముని నివసించు నరణ్యము. ఇక్కడనే దేవి విడువఁబడినది. వీరి పోలికలుకూడ నవియే. వయస్సుకూడ నిటువంటిది. అస్త్రములు స్వతఃప్రకాశములు. అందును చిత్రదర్శనమునాఁటి యస్త్రాభ్యనుజ్ఞానము ప్రబుద్ధమై తలఁపునకు వచ్చె. అసాంప్రదాయికము లస్త్రములు పూర్వులకును విని యెఱుఁగము. మఱియు వీరు కవలు. అప్పుడు దేవీగర్భముగూడ నట్లే పొడకట్టినది. హా! ఏమి గతి! (ఏడ్చు.)

లవు—తాతా! అదేమి జగన్మంగళమయిన మీ యాననము బాష్పప్లుతమై తుషారావృతమయిన పుండరీకమువలె వికల మవుచున్నది?

కుశ—రామాయణ మెఱుఁగనివానివలె నట్లడిగెదవేమి? సాధారణముగా నాలు వోయిన వాని కంతయు నరణ్యమే. అందును వీరిస్నేహము విశేషము. ఇన్నాళ్లని దుఃఖమునకు హద్దు లేదు. సీతాదేవిని విడిచినపిమ్మట రామునకు దుఃఖముగాకేమి యున్నది?

రా—(తనలో) ఓ హృదయమా! ఎందుకు నీకీదుడుకు? గుండెలు పగుల్చు నీ యుద్వేగమునకుఁ బిల్లలుకూడ జాలిపడుచున్నారు. (ప్రకాశము) వత్సలారా! రామాయణము రామాయణ" మని వాల్మీకులవారు రచించినట్లు వినఁబడుచున్నది. దానిలో నేదేని చేదువుఁడు. వినెదను.

కు—అవును. అందులో బాలకాండములోని చివర శ్లోకము లివి.

శ్లో॥ ప్రియాతు సీతా రామస్య దారాః పితృ కృతా ఇతి
గుణై రూప గుణై శ్చాపి ప్రీతి ర్భూయో౽భ్యవర్ధత॥
తథైవ రామ స్సీతాయాః ప్రాణేభ్యో౽పి ప్రియో౽భవత్ ।
హృదయం త్వేవ జానాతి ప్రీతి యోగం పరస్పరం॥

రా—(తనలో) హా! కష్టము. ఈహృదయ మర్మోద్ఘాత మతిదారుణము. హా! దేవి! జానకీ! తుదకిట్లయినవి నీ సంసార వృత్తాంతములు!

శా. ఆ యానందములట్టి ప్రేమ లయయో! ✽ ఆలాటి కౌతూహలం
బా యుత్సాహము సర్వ సంగతుల నా ✽ యైక్యంపు భావంబులున్
బోయెన్ సర్వముచుం గతించి అకటా! ✽ పోకున్న వీ కిల్బిష
ప్రాయంబుల్ మఱి యీ నృశంసకునకున్ ✽ ప్రాణంబు లెన్నాళ్ళకున్.

అయ్యో! కష్టము.

మ. అకళంకాశయ! కించి దంచిత పదం ✽ బా నీ సు వక్షోజను
ర్ముకుళం బీష దుదార మయ్యె నెపుడా ✽ పూవిల్తుఁడున్ లోపలన్
బ్రకటాత్ముండయి కుల్కుచున్ వెలుపలన్ ✽ భాసిల్లె ముగ్ధాత్ముఁడై
యకటా! జ్ఞాపిత మయ్యెఁ గాల మదియే ✽ హా! ప్రేయసీ! జానకీ!

లవు—ఇది చిత్రకూట మార్గమున మందాకినీ వన విహారమందు సీతాదేవితో శ్రీరాముఁడనిన మాట.

గీ. జానకీ! చూచితే దీని ✽ సరళ మయిన
వకుళ తరువు నీకొఱకు న ✽ వ్వంకలందు
మించు తావులతో గుబా ✽ ళించు పూలు
పఱిచి నట్లొప్పె నీ శిలా ✽ పట్ట మవుర!

రా—(సిగ్గుపడుచుఁ జిఱునవ్వు నవ్వుకొని) ఎందును బాలురు బహు ముగ్ధులు. అందును వీ రరణ్య చరులు. హా! దేవీ! తలఁతువా అప్పటి విస్రంభ ప్రసంగమును? హా కష్టము.

మ. పరిఫుల్ల శ్రమ వారి బిందు ఘనమై ✽ భాగీరథీ మారుత
స్ఫురణాందోళిత చూర్ణ కుంతలమునై ✽ భూషా బహిష్కార సుం

దర గండ ద్వయ కర్ణపాశమయి యానంద ప్రదంబైన యా
యరవిందాకృతి నీదు మోము స్మరణీయం బయ్యెయో జానకీ!

(మ్రానుపడినట్లుండి) హాహా! కష్టము.

గీ. కటకటా! సీత లేనట్టి కారణమున
నఖిలమును దోఁచు నా కెదో యడవి పగిది
నూఁక నిప్పులలోఁ బెట్టి యూఁదినట్లు
లుడుకుచున్నది మఱియు నాయుల్ల మకట!

(తెరలో)

గీ. ముని వసిష్ఠుఁడు వాల్మీకి జనక విభుఁడు
దశరథుని కళత్రము లరుంధతియు వేగ
బాలకుల కలహము విని భయముపడుచు
వచ్చుచున్నారు చల జటాభరముతోడ.

రా—ఏమీ! అరుంధతీవసిష్ఠులు అంబలు తాత జనకుఁడు నిక్కడనే యున్నారా!
అయ్యో వీరి కెట్లు చూతు? (కరుణముతోఁ జూచి) అయ్యో! తాత జనకుఁడు.

మ. "తగు సంబంధ" మటంచుఁ బెద్దలు ప్రమోదంబొంది మాతండ్రులన్
బొగడన్ నేర్చిరి మా వివాహమున నొప్పన్ వల్క యాలాటి బం
ధుగుణం జూచియు నిట్టి నా తల కడున్ బోదే వినిర్భిన్నమై
జగతిన్ దుష్కరమేమి రాముని కికన్ స్వప్రేయసీ ద్రోహికిన్?

(తెరలో)

అయ్యో! అయ్యో! గీ. శ్రీమ దాకార రేఖా విశేష మహిమ
నెట్టులో రాముఁ డంచుఁ దానెఱిఁగి ముందు
జనకుఁడు వచింప ముగ్గురు జనను లకట!
మునుఁగుచున్నారు వివశలై మూర్ఛలోను.

రా—గీ. జనకు గోత్రము రఘువు వంశమ్ము రెంటి
భద్రముల నిధి యగు సీత పైనిఁగూడఁ

గరుణ యెఱుఁగని పాపి యీ కటిక మీఁద
జాలి మీ కేల? వ్యర్థము సదయులార !

ఎదురేగి పూజింతు. (లేచెను.)

కుశలవులు — తాతా ! ఇటు.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది శ్రీ బ్రహ్మానంద విరచితము. ఉత్తరరామచరితము.

సమాప్తము.

శ్రీరస్తు.

బ్రహ్మానందీయము.

# ఉత్తరరామచరితము

## సప్తమాఙ్కము.

―――◆―――

తరువాత లక్ష్మణుఁడు ప్రవేశించు.

లక్ష్మ—(విస్మయముతో) భగవంతుఁడగు వాల్మీకిమహాముని పట్టణములలోను బల్లెలలోఁ గల యెల్లవారిని మాతో రప్పించి సురాసురులతోఁ జరాచరమయిన భూతజాము సర్వ మొకచోట సమకూర్చినాఁడు. "వాల్మీకులవారు స్వప్రణీత మయి గ్రంథము నప్సరసలచే నాడింతురు. గంగాతీరమున రంగస్థలము కల్పింపు" మ నన్ను మా యన్నగారాజ్ఞాపించిరి. వారి సెలవుప్రకారము సర్వము సన్నద్ధము జేసితి. రాజ్యాశ్రమమునఁగూడ మునివ్రతముతోనున్న మాయన్నగారు వాల్మీకు వారియందుఁగల గౌరవమువలన నిక్కడకు వచ్చుచున్నారు. ఆర్యునకు విజయము!

రాముఁడు ప్రవేశించు.

రా—వత్సా! లక్ష్మణ! వచ్చి కూర్చుండిరా సామాజికులు?

లక్ష్మ—చిత్తము.

రా—ఇదిగో! ఈ కుమారులు కుమార చంద్రకేతువుతో సరితూఁగు ప్రతిప్రత్యర్హులు.

లక్ష్మ—చిత్తము. ఇదిగో రాజాసనము. దయచేయుఁడు!

(అందఱును దగునట్లు కూర్చుందురు.)

రా—ప్రారంభింపుఁడు.

సూత్రధారుఁడు—(వచ్చి) భగవంతుఁడును భూతార్థవాదియు నగు వాల్మీకి స్థావర జంగమము జగము సర్వము నిట్లాజ్ఞాపించుచున్నాఁడు. ఏదో పావనమయిన యీ కరుణాద్భుత రస సందర్భము యోగదృష్టితోఁ జూచి వ్రాసితిమి. కావ్యగౌరవమువలన మీరందఱుఁ బరాకు లేక పరికింపుఁడు.

రా—అవును. మహర్షులు సాక్షాత్కృతధర్ములు. వారి వాక్కు లెందును వ్యభిచరింపవు.

(తెరలో)

హా! ఆర్యపుత్ర! కుమారలక్ష్మణ! నొప్పులుపడు దిక్కు లేని యీ నన్ను దుష్ట మృగములు తినఁ గోరుచున్నవి. హా! యీ నా శరీరము గంగ కర్పింతు.

లక్ష్మ—(తనలో) కటకటా! ఇది మఱియొకటి.

సూత్ర—గీ. రాజు విడువంగ దుర్గమా – రణ్యమందు
దేవి విశ్వంభరాత్మజ – దిక్కు లేక
ప్రసవ వేదన గల శరీ – రమ్ము నిపుడు
గంగ కర్పించుచున్నది – కడుఁ గలంగి.

(నిష్క్రమించె.)

రా—(భయముతో) దేవీ! దేవి! లక్ష్మణుని వీక్షింపుము!

లక్ష్మ—ఆర్యా! యిది నాటకము.

రా—హా! దేవీ! దండకారణ్యవాసప్రియసఖీ! ఇది నీకు రామునివలనఁ గలిగిన దుర్విపాకము.

లక్ష్మ—అన్నా! ప్రబంధము ఋషిప్రణీతము. దుఃఖపడక చూడుము.

రా—తమ్ముఁడా! గుండె ఱాయి చేసికొనియే కూర్చున్నాను.

(పిమ్మటఁ జేతి యొక బిడ్డ నొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని గంగా పృథువు లూఱడింప మూర్ఛిల్లిన సీత కనుపట్టు.)

రా—వత్సా! లక్ష్మణ! గాఢాంధకారమున మునిఁగినట్లు గ్రుడ్డి నగుచున్నాను. పట్టుకొనుము.

గంగ-పృథివి.—గీ. ఊఱడిల్లుము కల్యాణి! – యూఱడిల్లు
భద్రములు నీకు; నంతఃప్ర – సవ మందుఁ
గవలఁ బుత్రులఁ గంటివి – కళలు మెఱయ
భాగ్యవశమున శ్రీ రఘు – వంశ ధరుల.

సీ—(ఊఱడిల్లి) భాగ్యవశమున మగబిడ్డలను గంటి. హా! ఆర్యపుత్ర! (మూర్ఛిల్లు.)

లక్ష్మ—(పాదములపైఁ బడి) అన్నా! బ్రతికితిమి. రఘువంశమునఁ గళ్యాణము లంకురించినవి. (చూచి) హా! అన్న మూర్ఛిల్లినాఁడు. (విసరు.)

గంగ } బిడ్డా ! ఊఱడిల్లుము.
పృథివి }

సీత—(ఊఱడిల్లి) అమ్మా ! యెవరు మీరు?

పృ—ఈమె నీ శ్వశుర కుల దేవత భాగీరథి.

సీత—హా ! భగవతీ ! నమస్కారము.

గం—పాతివ్రత్యమునకుఁ దగిన భద్రములు వడయుము !

లక్ష్మ—బ్రతికితిమి.

గం—ఈమె మీ యమ్మ విశ్వంభర.

సీత—హా ! మాతా !

పృ—బిడ్డా !

(ఇరువురును కౌఁగిలించుకొని మూర్ఛిల్లుదురు.)

లక్ష్మ—(సంతోషముతో) ఆర్యురాలగు దేవిని గంగాదేవియు భూదేవియు ననుగ్రహించిరి.

~~రా—విధివశమున నిది మఱియొకటి.~~

గం—ఆహా ! కన్న కడుపున కెంత స్నేహము ! సర్వము సహించు సర్వంసహకుఁగూడ నిపు డీ యవస్థ. కాకేమి? కష్ట భూయిష్ఠము సంసార మందఱకు నొకటే. సఖీ! సర్వంసహా ! వత్సా ! వైదేహీ ! ఊఱడిల్లుఁడు.

పృ—(ఊఱడిల్లి) సీతను గన్న నా కూఱట యెట్లు ?

గీ. సైఁచుకొంటిని బిడ్డ రాక్షసుల మధ్యఁ
బూర్వ మెట్టులో పడియుంట నోర్చి నవుచుఁ
బగులుచున్నవి గుండె లీపరిభవంబు
సర్వతో దుస్సహం బెట్లు సైఁచుకొందు?

గం—విధి కృత మెవరు తప్పింపఁగలరు?

పృ—పోనీ ! ఇది బాగున్నదిగద మీ రామ భద్రునకు ?

గీ. బాల్యమునఁ బీడితంబైన పాణితలము
కాకపోయెఁ బ్రమాణము కడుఁ దలంప

నేనునుం గాక పోయితి నిజము మఱియు
జనకుఁడును గాఁడొ? కాఁడొ ఆ యనలుఁ డపుర ?

సీత—హా! ఆర్యపుత్ర !

పృ—ఎవఁ డార్యపుత్రుఁడు ?

సీత—(సిగ్గుపడుచుఁ గన్నీటితో) అవును.

రా—అమ్మా! వసుమతీ ! అవును. అటువంటివాఁడనే.

గం—భగవతీ! వసుంధర నీవేకద సంసారమునకు మూలము? ఎఱుఁగనిదానివలె నట్లందు వేమి ?

శా. పంకంబై యపకీర్తి యెల్ల దెసలన్ వ్యాపించు; నెచ్చోటనో
లంకాద్వీప మహాతాళ శోధన మెటుల్ నమ్ముఁ బ్రపంచంబు తా
శంకన్ దక్కి? జగమ్ము మెచ్చుకొను టేసర్వస్వ మా వంశమం
దంకింపన్ మఱి బాలుఁ డట్టి విషమం బందేమి కావించెడిన్ ?

లక్ష్మ—ఆహా! దేవతలకు సర్వము కరతలామలకము.

గం—భగవతీ ! వసుంధరా ! అయినను ఇదిగో నీకు నమస్కారాంజలి. ప్రసన్నురాలవు కమ్ము.

రా—అంబా ! భాగీరథి ! భగీరథకులమును బ్రదికించితివి.

పృ—దేవీ ! ఎప్పుడును నేను బ్రసన్నురాలనే. అయినను స్నేహ చాపలము నిలువనీయకున్నది. నేను రామభద్రునకు సీతపైఁ గల స్నేహ మెఱుఁగనిదానను గాను.

గీ. దైవ యోగమువలన వత్సను ద్యజించి
దారి మార్గముఁ గనక సంతాపపడుచు
భవ్య మయిన లోకుల పుణ్య బలమువలనఁ
బ్రాణములతోడ నున్నాఁడు రాముఁ డిపుడు.

రా—పెద్దల కెప్పుడును జిన్నలపై ననుగ్రహమే.

సీత—(ఏడ్చుచు) ఎందుకు నాకీ బ్రతుకు? అమ్మా! నన్ను నీలోఁ గలుపుకొనుము.

గం—ఏమంటివి ? వేయేండ్లు సుఖముగా నుండుము.

పృ—బిడ్డా ! నీ బిడ్డలను జూచికొనుము.

సీత—ఎందు కీ యనాథులు ?

రా—ఆహా! హృదయమా! ఎంత గట్టిదానవు.

గం—ఏమీ? అనాథులా వీరు. కారు. కారు. సనాథులే.

సీత—అయ్యో! యీ నిర్భాగ్యురాలి కంత యదృష్ట మెక్కడ?

గంగ—} గీ. అన్ని జగముల మంగళ శ్రీ మయిన నిన్ను
పృథివి—} నీవె కల్యాణి! యేల నిందించుకొనెదు?
నీదు సంపర్కమునఁ జేసి శ్రీ నిశ్చయముగఁ
బావనంబయ్యె మిగుల మా శ్రీ పావనతయు.

లక్ష్మ—అన్నా! వినుము.

రా—లోకము వినుఁగాక!

(తెరలోఁ గలకలము.)

రా—ఇదేదో అత్యద్భుతము.

సీత—ఇదేమి. గగనమంతయుఁ గలకలమని వెలుఁగుచున్నది?

గం—} ఓహో! తెలిసినది. ఇవి కృశాశ్వుఁడు కౌశికుఁడు రాముఁడు గురువులయిన జృం
పృ—} భకాస్త్రములతోడి దివ్యాస్త్రములు.

(తెరలో)

దేవీ! జానకీ! నమస్కారము. చిత్రదర్శనమునాఁడు మమ్ము రఘూద్వహుఁ డొసఁగినాఁడు
మాకు నీ కుమారులు శరణము.

సీత—ఆనందము. అస్త్రదేవతలు వీరే. ఆర్యపుత్రా! యిప్పటికిని నీ ప్రసాదములు ప్రకా
శించుచున్నవి.

లక్ష్మ—అవును. "ఇవి నీ ప్రసవమును బొందు" నని అన్నగారపుడు సెలవిచ్చిరి.

గంగ-పృథివి—గీ. అస్త్రదేవతలార! జోహారు మీకు
ధన్యలము మీ పరిగ్రహోత్సవమువలన
భద్ర మగుఁగాత మీకు! మీ శ్రీ ప్రభలు మెఱయఁ
దలచినపుడు బిడ్డలకుఁ బ్రత్యక్ష మగుఁడు!

రా— గీ. విస్మయానంద సందర్భ శ్రీ విపుల గతుల
ఘర్ఘరములైన కరుణోర్మి శ్రీ ఘురము లిపుడు

ప్రబలి యిట్టట్టు లన రాని ✽ పగిది నేఁడో
దశను మొలపించు చున్నవి ✽ తరళ మగుచు.

గం. పృ—వత్సా! సంతోషింపుము. నీ పుత్రు లిప్పుడు రామభద్రతుల్యులయిరి.

సీత—అయ్యో! వీరికి సంస్కర్త యెవరు?

రా— గీ. శ్రీ వసిష్ఠ మహాముని ✽ శిష్యు లయిన
అర్కకులదీపకుల కోడ ✽ లట్టి సీత
వెదకుచున్నది కటకటా! ✽ వికల యగుచుఁ
గలఁతపడి పుత్రులకును సం✽స్కర్త నిపుడు.

గం—దానికేమి? పాలు విడిచిన పిమ్మట బిడ్డలను వాల్మీకుల కొప్పగింతును.

పృ—బాగున్నది. బిడ్డా! రమ్ము. రసాతలము పవిత్రీకరింపుము.

సీత—అమ్మా! బ్రతికి పరిభవ మనుభవింపలేను. నన్ను నీలోఁ గలుపుకొనుము.

పృ—అమ్మా! ఆపయిని నీ యిష్టము. పిల్లలు పాలువిడుచువంతవఱకుమాత్రము నా చెప్పి నట్లు చేయుము.

గం—వత్సా? వైదేహీ? ఇప్పటి కిట్లు కానిమ్ము.

(గంగ - పృథివి - సీత - నిష్క్రమింతురు.)

రా—హా! చారిత్ర దేవతా! సీతా! (మూర్ఛిల్లు.)

లక్ష్మ—హా! హా! మహానుభావా! వాల్మీకీ! రక్షింపుము!

(తెరలో)

చెప్పుడు సేయకుఁడు! ఓ మర్త్యామర్త్యులారా! జంగమ స్థావరములారా! వాల్మీకి ప్రతిజ్ఞ చేసిన పవిత్రమగు నద్భుత మిదిగోఁ జూడుఁడు.

లక్ష్మ— గీ. కలఁగుచున్నది మిగుల గం✽గా జలమ్ము
ఆవరించిరి సుర మును ✽ లాకసమును
అహాహ! నీటి లోపలనుండి ✽ యార్య పైకి
వచ్చుచున్నది గంగతో ✽ వసుధతోడ.

(తెరలో)

భగవతీ! అరుంధతీ! మేము గంగా వసుమతులము. ఇదిగోఁ బుణ్యవ్రతయగు నీకోడలు సీత. నీ కొప్పగించుచున్నాము.

లక్ష్మ—అహో! ఆశ్చర్యము. ఆర్యా! అరుంధతీ! ఆర్యుఁ డింకను దెప్పిఱిలకున్నాఁడ

(అరుంధతియు సీతయుఁ బ్రవేశింతురు.)

అరు— గీ. వత్స! వైదేహి! మఱి భయపడక వేగ
రమ్ము! త్వరపడు! బ్రతికింపు రామభద్రు
జాలమును జేయక సుధా రసమ్ముఁ జిలుకు
చెల్లనగు నీ కరాంబుజ స్పర్శవలన.

సీత—(సంభ్రమముతో వచ్చి రాముని స్పృశించి) ఆర్యపుత్రా!

రా—(తెప్పటిల్లి - ఆనందముతో) ఆహా! యిదేమి! (అద్భుత సంతోషముతోఁజూ
ఓహో! దేవి జానకి. (సిగ్గుతో) అంబ అరుంధతి. ఋష్యశృంగాదులు గు
వులు.

అరుం—నాయనా! రామభద్ర! యీమె మీ కులదేవత భాగీరథి.

(తెరలో)

జగన్నాధా! రామభద్రా! "సీత నరుంధతివలె" ననుచుఁ జిత్రదర్శనమునాఁడు
వన్నది స్మరింపు. ఇఁక నేను ఋణ విముక్తను.

అరుం—ఈమె మీ యత్త వసుంధర.

(తెరలో)

"గుణవంతురాలగు నీ కొమారితను జూచికొను"
నాయుష్మంతుఁ డన్న మాట చెలి

రా—భగవతీ! నమస్కారము!

అరుం—ఓహో! పౌర జా
నిజ మహిమ
యీ దే
వి

లక్ష్మ

అరుం—రామభద్రా! బంగారు ప్రతిమకుఁ బ్రకృతి యగు సీత నిపుడు యథాధర్మము గా యజ్ఞమందు నియోగింపు.

రా—అమ్మా! మీ సెలవుప్రకారము.

లక్ష్మ—కృతార్థుఁడను.

సీత—బ్రతికితిని.

లక్ష్మ—ఆర్యా! నమస్కారము.

సీత—నాయనా! ఇట్లే చిరకాలము జీవింపుము!

అరుం—అయ్యా! వాల్మీకీ! సీతాగర్భసంభవులను కుశలవులను రామున కొప్పగింపుము. (నిష్క్రమించు.)

సీత—ఏరీ యెక్కడ నా పుత్రులు?

(వాల్మీకియుఁ గుశలవులును బ్రవేశింతురు.)

వాల్మీకి—కుమారులారా! ఈరాముఁడు మీ తండ్రి. ఈ లక్ష్మణుఁడు మీ పినతండ్రి. ఈ సీత మీ తల్లి. ఈ జనకుఁడు మీమాతామహుఁడు.

సీత—(సంతోషముతో) బిడ్డలు కుశలవులు.

వులు—హా! తాతా! తల్లీ!

(కౌఁగిలించుకొని) తండ్రులారా!

నన్నుఁ గౌఁగిలించుకొనుఁడు.

(భరతవాక్యము.)

శా. పాపంబుల్ తొలుచున్ విశుద్ధి గలుపున్ భద్రంబులన్ బెంచెడున్
దాపంబుల్ దుడుచున్ సుఖమ్ము నిలుచున్ భాగీరథీ రీతిమై
బ్రాపై యీ కథ యెల్లవారికి మనో వాంఛానురూపంబుగా
నాపాదించుత! దృష్టమై పఠితమై ఆచంద్రతారార్కమున్.

అందఱును—తథాస్తు!

(హారతి)

మంగళ మిది మన సీతాదేవికి మంగళ మిది మన శ్రీరామునకున్
మంగళ మిది మఱి ధాత్రీపుత్రికి మంగళ మిది దశరథ పుత్రునకున్
మంగళ మిది హత దుష్పాపులకున్ మంగళమిది శ్రీహరి రూపులకున్
మంగళ మిది సుగుణా రాములకున్ మంగళ మిది సీతా రాములకున్.

క. మంగళము జనక తనయకు
మంగళ మిక్ష్వాకు వంశ మండన మణికిన్
మంగళము సుకవి కృతులకు
మంగళ మందఱకు మఱియు మంగళముపయిన్.